శ్రీ గురవేనమః

# శ్రీ కృష్ణోద్ధవ సంవాదంబను

# పరమపద మార్గము

గ్రంథకర్త :

శ్రీమాన్ పోకల శేషాచల స్వాముల వారు

అచల గురువులు శ్రీ పోకల శేషాచల స్వాముల వారి శిష్యుండు
శ్రీ పోలకం నరసింహ స్వాముల వారి శత వార్షిక ఆరాధన సందర్భంగా
ఏతత్ పీఠ గ్రంథంబైన "శ్రీ కృష్ణోద్ధవ సంవాదంబను పరమపద మార్గము"
సరిచూడబడి పునఃప్రచురణ చేయడమైనది.

ప్రకాశకులు :

శ్రీ సహజానంద ముద్రబోయిన సుబ్బారావార్యులు,
పీఠాధిపతి

శ్రీ పోలకం నరసింహ స్వాముల వారి అచల మందిరము,
ఇప్పటం గ్రామము, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా.

# గ్రంథ దాతలు



**పలగాని అన్నపూర్ణమ్మ గారు,**

ఇప్పటం, తాడేపల్లి మండలం

**మరియు**

**బొర్ర నాగేంద్రమ్మ గారు,**

శలపాడు, చేబ్రోలు మండలం

శ్రీ గురవే నమః

## శ్రీ కృష్ణోద్ధవ సంవాదంబను

# పరమపద మార్గము

శ్రీ మద్వేదాంత సారుండును, ప్రకృతి ద్వయదోషరహితుండును, సచ్చిదానంద సహితుండును, నాదబిందు కళాతీతుండును, నిరాకార నిర్గుణుండును, నిర్వికార నిరంజనుండును, నిర్ద్వంద్వుండును, నుపాధి ద్వయదోష రహితుండును, నచల పరిపూర్ణుండును, నశరీరుండును నైన శ్రీకృష్ణభగవానుని, నుద్ధవుండను భాగవతోత్తముడు గాంచి, యా మహాత్ము నకు నమస్కరించి యంజలిబద్ధుండై దేవ దేవోత్తమా! పరమ గురుండవైన నిన్నుం బ్రార్థించెద. నా మనోదుఃఖమును బోగొట్టి నాకు బరమపదమార్గమును బోధించి, జననమరణ ప్రవాహమునందుండి తప్పించు భారము మీది, నేను మిగుల నజ్ఞానుండనని పెక్కువిధముల వినుతించెను. ఆ భగవానుడు, చిఱు నగవుతో నా యుద్ధవునింజూచి, మిత్రుడా, నీవు మిగుల బోద్ధవగుటం జేసి, త్రిలోకములకు నసాధ్యమైన ప్రశ్న జేసితివి, నీ ప్రశ్న మిగుల నమోఘము, పరమభక్తులును, మహా యోగపురుషులును, యతులును, జ్ఞానులును, మహర్షులును, మునులును, దిగంబరులును, నింద్రాది దేవతలును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును జెప్పుటకు నసాధ్యము, నీ వెంతటి పుణ్యుండవో, నీ భాగ్యమే భాగ్యము, ఎంతటి వారును మోక్షాది పదవులను గోరిరేగాని, నీవలె బరమపదమును గోరినవారు లేరు. ఆహా! నిన్ను జూడ నాకు మిగుల వింతగానున్నది. నీవు మిగుల బుణ్యుండవని యతని నాలింగము చేసుకొని, కూర్చుండ నియమించి, యుద్ధవా! సద్గురు స్వామియైన సాందీప మహా ఋషిని నా మనంబు ధ్యానించి, యా మహాత్ముని పాదపద్మములను నా హృదయ కమలమున నిలుపుకొని, గురు రహస్యమైన పరమపదమును నీకు నెఱింగించెద, నిర్మల చిత్తుండవై వినుమని యిట్లనియె.

ఉద్ధవా, వేదాంతమే పరమపదము. ప్రపంచ రహితమే పరమ పదము, జీవేశ్వర ఐక్యమే పరమపదము. నేను నీవు రహితమే పరమపదము. ప్రకృతి ద్వయదోష రహితమే పరమపదము. కార్యకారణములు లేనిదే పరమపదము. కల్పనారహితమైనదే పరమపదము. శబ్ధరహితమే పరమపదము. క్షేత్రక్షేత్రజ్ఞ రహితమే పరమపదము. బంధమోక్షములు లేనిదే పరమపదము. నాశరహితమైనదే పరమపదము, సుఖదుఃఖములు లేనిదే పరమపదము, లోకాలోకములు లేనిదే పరమపదము. కాలాకాలములు లేనిదే పరమపదము. నాదబిందు కళాతీతమే పరమపదము. ద్వంద్వములు కానిదే పరమపదము. ఉపాధిద్వయదోష రహితమే పరమపదము. సచ్చిదా నందరహితమే పరమపదము స్థూలసూక్ష్మకారణ మహాకారణ శరీరాత్మలు లేనిదే పరమపదము. ఇట్టిదట్టిదని నిర్దేశింపరానిదే పరమపదము, ఉత్పత్తి స్థితిలయములు లేనిదే పరమపదము, నామరూపములు లేనిదే పరమపదము. చావుపుట్టుకలు లేనిదే పరమపదము, స్త్రీ పురుష నపుంసకములు కానిదే పరమపదము. సర్వకాలములు యందును, సర్వ దేశములయందును, సమస్త వస్తువుల యందును, చలించక నిండి నిబిడీకృతముగా నుండునవదే పరమపదము. సర్వ పరిపూర్ణమే పరమపదము, పట్టనలవికానిదే పరమపదము, అంటనలవికాని యచలమే పరమపదము. అహంవృత్తి రహితమే పరమపదము. అశరీరమే పరమపదము. నిర్వికారమే పరమపదము. యుక్తికిం జిక్కక మనంబునకుం దగులక, సాధ్యాసాధ్యములు కానిదే పరమపదము. సర్వ శూన్యము కానిదే పరమపదము, ఆచార్య కటాక్షమే పరమపదము. జ్ఞానాజ్ఞానములు కానిదే పరమపదము, మొదలుతుదలు లేనిదే పరమపదము, పరమపదమే మహాప్రభు, పరమపదమే దేవుడు. చావు పుట్టుకలు లేని వాడే దేవుడు. వికార రహితుడే దేవుడు, శరీరాత్మలు లేనివాడే దేవుడు. దేవుని దర్శనమే జననమరణ ప్రవాహ రహితము. దేవుని జూడకగాని భ్రాంతివదలదని చెప్పెను. ఆ యుద్ధవుండు స్వామీ,

భ్రాంతి యెటుల గలిగెను. అట్టి మాయను బుట్టించిన వారెవ్వరని యడిగిన, నా భగవానుడిట్లనియెను.

ఉద్ధవా, మాయను బుట్టించినవారు లేరు. మాయ పుట్టనేలేదు. ఏమియునులేని యచలబ్రహ్మ మేరీతి మాయను బుట్టించును? శరీరాత్మలు లేని పరిపూర్ణ మెటుల మాయను గల్పించును, నిర్వకార నిరంజనమైన పరమపదము వలన వికారమైన భ్రాంతి యెటుల జన్మించును. రజ్జుసర్ప న్యాయంబున, నెండమావులపగిది, శశవిషాణములవలె, దారుపురుషుని రీతి, నెఱుక పురుషుడు భ్రాంతివలనం దోచుచుండును అతడే వంధ్యా సూనుడు. విచారణచేత గాని మాయలేకపోదు, చక్కగా విచారించు నెడల గొడ్డురాలికి బిడ్డలేక పోవునేగాని, గొడ్డురాలని చెప్పబడిన పరిపూర్ణములేక పోదు. ఎండమావులయందు నీళ్లు లేకపోవునేగాని యెండమావులని చెప్పబడిన బయలు లేకపోదు. కుందేటికి గొమ్ములు లేకపోవునేగాని, కుందేలని చెప్పబడిన యచలము లేకపోదు. దారువునందు బురుషుడు లేకపోవునేగాని దారువని చెప్పబడిన కేవలాత్మ లేకపోలేదు. కాబట్టి విచారణ చేతగాని భ్రాంతి నిరసనముగాదు భ్రాంతి యెవరివలనను బుట్టినది కాదు, పుట్టించబడను లేదు. తనంతట దానేవచ్చినదిగా బట్టి, యెఱుక యనెడు మాయకు మూలము లేదు.

**శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం, భ్రమేణోపాసకం మనః॥**
**భ్రమేణేశ్వరభావత్వం, భ్రమమూలమిదంజగత్॥**

అని యున్నది గనుక, సర్వముభ్రమ, భ్రమయే భ్రాంతి, భ్రాంతియేమాయ, మాయయే యెఱుక, ఎఱుకయే పరబ్రహ్మమనుట, ఎఱుకయే నారాయణ మూర్తి ఎఱుకయే సదాశివుడు. ఎఱుకయే యాపోజ్యోతి, ఎఱుకయే యంతరాత్మ, ఎఱుకయే యాత్మారాముడు. ఎఱుకయే సోహం, ఎఱుకయే జీవేశ్వరులు, ఎఱుకయే శరీరాత్మలు, ఎఱుకయే నాదబిందుకళలు, ఎఱుకయే సచ్చిదానందమూర్తి, ఎఱుకయే విశ్వుడు, ఎఱుకయే తైజసుడు, ఎఱుకయే

ప్రాజ్ఞుడు, ఎఱుకయే హిరణ్యగర్భుడు, ఎఱుకయే యేడులోకములు, ఎఱుకయే పంచబ్రహ్మలు, ఎఱుకయే త్రిమూర్తులు, ఎఱుకయే యింద్రాదిదేవతలు, ఎఱుకయే మహర్షులు, ఎఱుకయే పురుషుడు, ఎఱుకయే స్త్రీ, ఎఱుకయే తండ్రి, ఎఱుకయే తల్లి, ఎఱుకయే సోదరులు, ఎఱుకయే బంధువులు, ఎఱుకయే దేహేంద్రియములు, ఎఱుకయే గుణములు, ఎఱుకయే ప్రకృతి ద్వయము, ఎఱుకయే యుపాధిద్వయము, యెఱుకయే దేహిదేహములు, యెఱుకయే కార్యకారణములు, యెఱుకయే బీజజడములు, యెఱుకయే సంకల్ప వికల్పములు, యెఱుకయే వేదశాస్త్రములు, యెఱుకయే ప్రపంచము, యెఱుకయే జ్ఞానాజ్ఞానములు, యెఱుకయే ధర్మాధర్మములు, యెఱుకయే సత్యాసత్యములు, యెఱుకయే నిత్యానిత్యములు, యెఱుకయే సాకార నిరాకార ములు, యెఱుకయే పుణ్యపాపములు, యెఱుకయే స్వర్గనరకములు, యెఱు కయే జ్ఞానకర్మములు, యెఱుకయే బంధమోక్షములు, యెఱుకయే పదవులు, యెఱుకయే పంచలోహములు, యెఱుకయే నవరత్నములు, యెఱుకయే కులగోత్రములు, యెఱుకయే బ్రాహ్మణుండు, యెఱుకయే నామరూపములు, యెఱుకయే గురుశిష్యులు, యెఱుకయే పంచభూతములు, యెఱుకయే ప్రణవము, యెఱుకయే యుపశ్రుతివాక్యము, యెఱుకయే సప్తకోటి మహామంత్రములు, యెఱుకయే దేవుడు, యెఱుకయే భక్తుడు, యెఱుకయే ద్వంద్వములు, యెఱుక లేనిదే పరమపదము, పరమపదమందు నేమియును లేదు. (అనగా నేమియును లేనివాడు) భ్రాంతి వలన సర్వము నెఱుకకే తోచుచుండును. వినుట, చూచుట, గ్రహించుట, భాషించుట, ప్రవర్తించుట మొదలైన సర్వవృత్తులను నెఱుకకే కలిగియుండును యెఱుకయే చిత్ర విచిత్రములు, ఆహా! యెఱుకను విడుచుటకు నెంతటివారికిని సాధ్యపడదు, భక్తి యోగజ్ఞానులు, మాయ యెఱుకను బ్రహ్మమని యోచించి, యాభ్రాంతిని విడువకున్నారు. అశరీరాలు దప్ప. సశరీరులందఱును భ్రాంతితోనే యున్నారు. భ్రాంతితో గూడుకొన్నవే వేదోక్త మార్గములు, వేదాంతమే

భ్రాంతిరహితము, వేదాంతమే పరమపదము, దానిని నెంతటివారును బట్టజాలరు. తొలుత వేదోక్తములైన మార్గములనే యనుసరించి యా యెఱుక ప్రభావమును జక్కగా దెలిసికొని, రూపనామములు గల సర్వము నెరుక యనియును, నెఱుకయే మాయయనియును, మాయనిజముగా లేనిదనియును, భ్రాంతియే కారణమనియును, సద్గురు కటాక్షంబున నెఱింగిన పుణ్యపురుషులకు భ్రమ విడుచునేగాని, యితరులకు విడువనేరదు. గాబట్టి తొలుతనే పరమపద మార్గమును జెప్పరాదు. యెంతటివారును దానిం బట్టజాలరు. పరమపదము యుక్తికిం బట్టదు. శక్తికి సాధ్యపడదు. మదికిం దోచదు. ఇంద్రియములకు వశపడనేరదు, యెండకు నెండదు, వానకు దడువదు, చలికి నులికిపడదు, సర్వకాల మొకతీరుగానున్నది, ఆచార్య కటాక్షములేక యెంతటి వారికిని బొంద శక్యముకాదని చెప్పిన, నాయుద్ధవుండు మిగుల నాశ్చర్యమును బొంది యా భగవంతునకు నమస్కరించి, స్వామీ, సద్గురుమూర్తీ, పరమపదమార్గమునే చెప్పక, భ్రమరూపకములైన పదవులను జెప్పుటచేత, భ్రమ విస్తరించునేగాని భ్రమను విడుచుటెట్లని యడిగిన నా భగవంతుడిట్లనియె.

ఉద్ధవా, యెన్నండును గురిగింజల బంతినింజూడని యొక పండితుండ దాటున బిడ్డయూ యెల తొట్టికిం గట్టియుండిన గురిగింజల బంతినింజూచి, నిప్పు మండుచున్నదని యోచించి తన చెంతనున్న వారు భయపడు నటుల గొప్ప కంఠధ్వనితో 'బిడ్డ యుయ్యాల తొట్టిమీద నిప్పు మండుచున్నదని యఱచెను.' అందుండువారు వచ్చిచూచి 'నిప్పు కాదు గురిగింజలబంతి' యని చెప్పిరి. పిమ్మట నాపండితుండు గ్రహించి, తన భ్రాంతిని దాను దూషించుకొనెను. కాబట్టి, యెంతటివారైనను ముందెన్నడు జూడని చిత్ర విచిత్రములను జూచిన యెడల భ్రాంతినిం బొందుదురు. ఇది యునుంగాక, మామిడిపండు తినని వారికి దానియందె భ్రాంతి పుట్టుచుండును. రుచి చూచినవారికి భ్రాంతి పుట్టనేరదు. ఎట్లను విడిచి

చేపనుం బట్టునటుల నెఱకలోని మార్గములయందే ప్రవేశించి, యా యెఱుక ప్రభావమును గ్రహించి, గురువాక్యము చేత నా యెఱుకను విడుచుట మిగుల సునాయాసము. మరల సంశయములు పుట్టనేరవు. 'సంశయాత్మా వినశ్యతి' యను పలుకు వాక్యమునకు దృష్టాంతముగానొక చిన్నకథ గలదు వినుమని యిట్లనియె.

ఉద్ధవా, తొల్లి గంగానదీతీరంబున, నొక మునిపుత్రుం డెఱుకలోని పదవులను రోసి, తన తండ్రివాక్యమును మీఱి, తాను బరమపద మార్గమునే గ్రహించి జననమరణ ప్రవాహమునుండి విముఖత్వమును బొందవలెనని యోచించి, బంధమోక్షములను నిందించి, తండ్రిని విడిచి ప్రయాణమయి పోయి, యడవులన్నియు దిరుగుచు, నెందును నచలగురువునుం గనిపెట్ట జాలక మిగుల నాయాసమును బొంది, నారాయణాశ్రమమును, బదరికాశ్రమమును జుట్టిచుట్టి మిగుల దుఃఖముగలవాడై యొక గుంట గట్టునం గూర్చుండి యేడ్చుచుండెను. అచటికి నచల గురుని పుత్రులలో నొకడువచ్చి యా మునిపుత్రునింజూచి విచారించి మిగుల బరితాపముగలవాడై యతనిం దోడ్కొనిపోయి తన గురునియొద్ద విడిచి యా మహాత్మునకు సర్వము నెఱిగించెను. ఆ యచలగురుండా మునిపుత్రుని నాదరించి, బిడ్డా నీ మనో దు:ఖమును నాకు దాచక వినుపించుమనిన, నామునిపుత్రుడు స్వామీ, పరమపదమును దర్శించిన వారికి జనన మరణములు లేవనియును, నెఱుకలోని పదవులు భ్రాంతి రూపకములనియు విని, యా పదవులను నిందించి, తండ్రి వాక్యమునిరాకరించి, యయిదు సంవత్సరములు పెద్దల యాశ్రమములను జుట్టిచుట్టి యచల గురువునుం గనిపెట్టం జాలక యూరి బయట గుంట గట్టునం గూర్చుండి యేడ్చుచుంటిని, నన్నీ పుణ్యపురుషుండు దోడ్కొనివచ్చి మహాప్రభువులగు మిమ్ముం జూపించెను. మహాత్మా నాకు పరమపదమార్గమును బోధించి, నన్ను జననమరణ ప్రవాహము నుండి దొలగించుడని పెక్కు విధముల బ్రార్థించిన, నా దయాళుండా మునిపుత్రుని

యందు గరుణగలవాడై మిగుల వైరాగ్య పరుండనియును బరిపూర్ణ భావమును బట్టగలడనియును యోచించి యతనికి బరమపద మార్గమును బోధించి నిజస్వరూపమును బొందించెను. ఆ మునిపుత్రుడేవింతలును లేనట్టి పరమపదమును బట్టజాలక, సంశయాత్మకుండై మఱల జన్మము నొందెనని పూర్వోక్తికలదు. కాబట్టి యెంతటివారును సంశయమును విడువనేరరు. అబ్బా! యిది యలవిగాని మార్గము.

నీవు విపరీత భావమును విడిచి యెఱుకలోని మార్గముల ననుసరించి సాలోక్యము, సామీప్యము, సారూప్యము సాయుజ్యము, సార్ష్టిత్వము, మోక్షంబులను పదవుల దాటి, యాపరమపదంబును బొందుము, నీకు సంశయమును, భ్రాంతియును బుట్టనేరవని చెప్పెను. ఆ యుద్ధవుండంజ లీబద్ధుండై, స్వామీ, నాకు మిగుల సునాయాసమైన మార్గంబులబోధించి, నన్ను జననమరణ ప్రవాహంబునుండి తొలగించెడు భారంబు మీదియని పెక్కువిధంబుల వినుతించిన నా భగవంతుండిట్లనియె.

ఉద్ధవా, వేదంబులు కర్మకాండమనియు జ్ఞానకాండమనియు రెండువిధంబులుగా విభజింపబడియున్నవి. కర్మకాండంబు ననుసరించిన మానవులు వివిధ కర్మంబులను నహంకారముతో నాచరించి యమపురంబున నరకమనుభవింతురు. కొందఱు మానవులు కర్మకాండలోని శాంతశమద మాది గుణంబుల ననుసరించి, నరకంబునకు వెఱచి యజ్ఞయాగాది వివిధ క్రతువులను గావించి, యింద్రపురమగు స్వర్గంబును బొందుదురు. మఱి కొందఱు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను మూర్తులనమ్మి, భక్తిపూర్వకంబుగ నా పద్మసంభవుని గర్మేంద్రియమైన వాక్కుతో ధ్యానించి బ్రహ్మపట్టణంబును, విష్ణుదేవుని గర్మేంద్రియమైన నోటితో ధ్యానించి విష్ణులోకంబును, శివదేవుని గర్మేంద్రియమైన నోటితో ధ్యానించి, శివలోకంబును బొందుదురు. ఇవి యన్నియు నిల్కడయైనవికావు. కేవలతుచ్ఛ సుఖంబులు కర్మయే ప్రధానము లుగా గలవి. జ్ఞానకాండమును ననుసరించిన పుణ్యాత్ములు పరబ్రహ్మంబుతో

గూడిన సాలోక్యంబు, సామీప్యంబు, సాయుజ్యంబు, సాష్టిత్వంబు, మోక్షమను నీ యాఱుపదవులను బొందుదురు. అట్టి శ్రేష్ఠంబులైన మార్గంబులను వినుము. సాంఖ్యసూత్రమనియు, నాత్మ విచారమనియు, నాదానందమనియు, గేవలానందమనియు, బరమహంసభావ మనియు, జ్ఞానమార్గమనియు, నీ యారుమార్గంబులే రాజమార్గంబులని చెప్పంబడు చున్నవి. తక్కిన మార్గములు మిగుల గష్టతరములు, ఫలితార్థంబును బొందుట మిగుల దుస్తరంబు, అట్టి పదవులను బొందించుటకు నాచార్యుడే కర్త. ఆచార్యుడే సాకార పరబ్రహ్మము, దేవునిం జూపించినవాడే యాచార్యుడు. ఆచార్యుండే గురుండు. ఆచార్యుడే దేశికుడు, ఆచార్యుడే పరబ్రహ్మము. ఆచార్యుండే పరమపదము. ఆచార్యుని కటాక్షమే పుణ్యంబు. గురుకటాక్షమే వైరాగ్యంబు. గురుకటాక్షమే యోగంబు. గురుకటాక్షమే భోగంబు. గురుకటాక్షమే జ్ఞానము, ఆచార్యునకు వివిధోపచారములు గావించుటయే కైంకర్యంబు. కైంకర్యమనగా గింకరత్వంబు. ఆచార్యుని యాజ్ఞప్రకారంబు నటించుటయే కైంకర్యంబు, ఆచార్యునకు దను మనోధనములను శంకలేక సమర్పించుటే కైంకర్యము. కైంకర్యమే మోక్షంబు. కైంకర్యమే జన్మశూన్యము.

**శ్లో॥ గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణు ర్గురుదేవో మహేశ్వరః।**
**గురుస్సాక్షాత్పర బ్రహ్మా। తస్మై శ్రీగురవే నమః॥**

ఇదియే గురుమంత్రంబు, గురుమంత్రమే వేదంబు, గురుమంత్రమే సర్వపాపక్షయంబు, గురుమంత్రమే త్రిలోకపావనంబు, గురుమంత్రమే మోక్షంబు. గురుదర్శనమే జన్మపావనంబు, దేశికుని శ్రీపాదజలమే మహాతీర్థము. ఆచార్యుని భుక్తశేషమే మహాప్రసాదంబు. అండము గురుండు, పిండము గురుండు, బ్రహ్మాండంబు గురుండు సచరాచర మంతయును గురుండు, గురునికంటెను వేఱొకరులేరు. గురుడే బ్రహ్మా, గురుండే విష్ణువు, గురుడే శివుడు, గురుడే పరబ్రహ్మంబు, గురుండే దేవుడు, గురుండే నారాయణమూర్తి, గురుండే సదాశివుడు, గురుండే ముక్తికాంత, గురుండే త్రిమూర్త్యాత్మక స్వరూపుండు, గురుండు తప్ప వేఱొక బ్రహ్మయున్నాడని

భావించు సంశయమే పాపము. గురుడు తప్ప వేఱొక విష్ణువున్నాడని భావించు సంశయమే నరకంబు, గురుడుతప్ప వేఱొక శివుడున్నాడని భావించు సంశయమే జననంబు, గురుడు తప్ప వేఱొక దేవుడున్నాడని భావించు సంశయమే పుట్టుక. గురుండు తప్ప వేఱొక పరబ్రహ్మమున్నాడని భావించు సంశయమే బంధంబు. గురుండే మోక్షంబు గురునికంటెను వేఱొక రక్షకులు లేరు. గురుండే మోక్షాదిపదవుల నిచ్చెడు మహాత్ముండు. గురుస్వామికి సమానులు లేరు. సద్గురు కటాక్షంబువలననే పరమపద సాక్షాత్కారంబు. కాబట్టి గురుపాదమే గతియని చెప్పెను. ఆ యుద్ధవుండంజలీబద్ధుండై త్రిలోక గురుండైన యా శ్రీకృష్ణ దేవుని బెక్కువిధంబుల వినుతించి, స్వామీ, శిష్యుండెట్టి వాడు? వినిపించుడని వేడిన నా భగవంతుండిట్లనియె.

ఉద్ధవా, సద్గురుడే పరబ్రహ్మంబని భక్తి శ్రద్ధలుగల వాడే శిష్యుండు. త్రికరణశుద్ధిగా గురునకు వివిధోపచారములు గావించువాడే శిష్యుడు. ఆచార్యుని సంతుష్టినొందించువాడే శిష్యుడు, తను మనోధనంబులయందు వంచనలేక యాచార్యునకు సమర్పించువాడే శిష్యుండు. దేశికుని చరణంబులను మనంబున నిలిపి యర్చించువాడే శిష్యుడు దేశికుని శ్రీపాదజలంబును మహాతీర్థంబుగ గ్రహించు వాడే శిష్యుడు. దేశికుని భుక్తశేషంబును మహాప్రసాదముగ గ్రహించువాడే శిష్యుండు. ధూపదీప నైవేద్యంబులచే నాచార్యునిం దృప్తి పొందించువాడే శిష్యుండు, గురునాజ్ఞ ప్రకారంబు నటించువాడే శిష్యుడు. సద్గురుని దేవుడని భావించెడువాడే శిష్యుండు. అండపిండ సచరాచరమంతయును గురుడని భావించువాడే శిష్యుండు. అట్టి త్రికరణ శుద్ధిగల శిష్యునకు సాటిలేరు. బ్రహ్మయును, విష్ణువును, శివుండును, నింద్రాదిదేవతలును నతనికి సమానులుగారు, అట్టి శిష్యునింగనిన భూతకోటి భయపడును. దిక్కులు గంపించును. దివిజులు వెఱగందుదురని శిష్యుని ప్రభావమంతయును బోధించెను. ఆ యుద్ధవుండు మిగుల నద్భుతము నొంది, మహాత్మా, సాంఖ్య సూత్రమనెడు దేహతత్త్వంబును భోదించుడని వేడిన, నా భగవంతుండిట్లనియె.

## సాలోక్యపదవికి మార్గమైన సాంఖ్యసూత్రము

ఉద్ధవా, సాంఖ్య సూత్రమనంగా బంచ భూతవివక్షయనియును. బంచీకరణ మనియును, దేహతత్త్వ విచారణ యనియును, బ్రకృతి విచారణ యనియును జెప్పంబడును. గురుముఖంబున నెఱింగిన పుణ్యాత్ములే తత్త్వవేత్తలు. వారే యుత్తములు. వారే బ్రహ్మపదవికిం బోవువారు. నీవు త్రికరణ శుద్ధిగలవాడవై యుండుమని, యోంకార మాదియును రాంబీజ మంత్రమునుగాగల యష్టాక్షరీమంత్ర, మంత్రార్థ, మంత్రమూల, మంత్ర సారంబులను బోధించి, యీ యష్టాక్షరీ మంత్రంబు, పరబ్రహ్మంబుతో గూడుకొనియున్నది. సామాన్యులు దీనిందెలియజాలరు. ఈ మంత్రమే త్రిలోకపావనంబని యా మంత్రమహిమ నంతయును బోధించి, పంచభూత స్థానంబులను జెప్పి, షడాధారంబులను నధిదేవతలను దెలియపఱచి, యుద్ధవా, "సరంఖల్విదం బ్రహ్మ" మను శ్రుతిని ననుసరించి, తొలుత నిర్వికారాచల పరిపూర్ణ బ్రహ్మముండెను. ఆ బ్రహ్మంబునందు నొకజ్ఞాన శక్తి కలిగెను. ఆ జ్ఞానశక్తి వలన నాకాశంబును, నాకాశము నందు వాయువును, వాయువునం దగ్నియును, నగ్నియందు జలమును, జలమందు బృథ్వియును, బృథ్వియం దోషధులును జనించి ప్రపంచమాయెను.

### తద్వివరణం బెట్టిదనిన

ఆకాశములోని యర్థభాగంబు రెండు భాగంబులై యందులో నొకటి జ్ఞాతయయ్యె. తక్కిన యొక భాగంబును నితర నాలుగు భూతంబులైన వాయ్వగ్ని సలిల పృథ్వులం గూడుచున్నది. వాయువునుంగూడి మనస్సును, నగ్నిం గూడి బుద్ధియును, నుదకంబునుంగూడి చిత్తమును, బృథ్వినింగూడి యహంకారమును నాయెను. ఇవియే యంతరింద్రియములు. జ్ఞాతకు క్షేత్రపాలకుండును, మనస్సునకు జంద్రుండును, బుద్ధికి బ్రహ్మయును, జిత్తంబునకు విష్ణుండును, నహంకారంబునకు రుద్రుండును నధిదేవతలు.

వాయువులోని యర్థభాగంబు రెండు భాగంబులై యందులో నొక భాగంబు వ్యానవాయువయ్యె. తక్కిన యొక భాగ మితర నాలుగు భూతంబులైన యాకాశాగ్ని సలిల పృథ్వుల గూడుచున్నది. ఆకాశంబునుం గూడి సమాన వాయువయ్యె. అగ్నింగూడి యుదానవాయువయ్యె. ఉదకంబునుంగూడి ప్రాణవాయువయ్యె. పృథ్వి గూడి యపాన వాయువాయెను. ఇవే పంచప్రాణంబులు వ్యానవాయువునకు విజయుండును, సమానవాయువునకు జయుండును, నుదాన వాయువునకు విశ్వయోనియును, బ్రాణవాయువునకు విసృష్టుండును, నపానవాయువునకు విశ్వకర్తయును నధిదేవతలు.

యగ్నిలోని యర్థభాగంబు రెండు భాగంబులై యందులో నొకటి చక్షువయ్యె. తక్కిన యొక భాగంబున నితర నాలుగు భూతంబులైన, యాకాశవాయు సలిల పృథ్వులంగూడుచున్నది. ఆకాశంబును గూడి శ్రోత్రమయ్యె. వాయువునుంగూడి త్వక్కయ్యె. ఉదకంబునుం గూడి జిహ్వయయ్యె. పృథ్వినింగూడి ఘ్రాణంబాయెను. ఇవే జ్ఞానేంద్రియంబులు. చక్షువునకు సూర్యుండును, శ్రోత్రంబునకు నష్టదిక్కులును, త్వక్కునకు వాయువును, జిహ్వకు వరుణుండును, ఘ్రాణమునకు నశ్వినీ దేవతలును నధిదేవతలు.

ఉదకంబులోని యర్థభాగంబు రెండు భాగంబులై యందులోనొకటి రసంబయ్యె. తక్కిన యొక భాగము నితర నాలుగు భూతంబులైన, యాకాశవాయ్వగ్ని పృథ్వులం గూడుచున్నది. ఆకాశంబునుంగూడి శబ్దమయ్యె. వాయువునం గూడి స్పర్శయయ్యె. అగ్నినింగూడి రూపంబయ్యె. పృథ్వింగూడి గంధం బాయెను. ఇవే పంచతన్మాత్రలు. జ్ఞానేంద్రియంబులకు విషయంబులు, ఉదకతత్త్వంబులు.

పృథ్విలోని యర్థభాగంబు రెండు భాగంబులై యందునొకటి పాయువయ్యె. తక్కిన యొక భాగము నితర నాలుగు భూతంబులైన

యాకాశవాయ్వగ్ని సలిలంబులం గూడుచున్నది. ఆకాశంబును గూడి వాక్కయ్యె. వాయువునుంగూడి పాణియయ్యె. అగ్నినింగూడి పాదమయ్యె. ఉదకంబునుం గూడి గుహ్యం బాయెను. ఇవే కర్మేంద్రియంబులు, వాక్కున కగ్నిదేవుండును, పాణికి దేవేంద్రుండును, పాదమునకు విష్ణు దేవుండును, గుహ్యంబునకు బ్రహ్మయును, పాయువునకు మృత్యువును నధిదేవతలు, ఐదు మహాభూతంబుల నొక్కొక్కటినైదుగా భాగించి, యైదైదుల నిరువదియైదు కలయంబంచిన బంచీకృతంబయ్యె.

(ఇరువదియైందు తత్వంబులయందే స్థూలసూక్ష్మ కారణములు కూడియుండుటచే, నిందొక్క చక్రంబుగానే వేయబడినది).

## పంచీకరణ చక్రము

| | | | | |
|---|---|---|---|---|
| జ్ఞానం | మనస్సు | బుద్ధి | చిత్తం | అహంకారం |
| సమానం | వ్యానం | ఉదానం | ప్రాణం | అపానం |
| శ్రోత్రం | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణం |
| శబ్దం | స్పర్శం | రూపం | రసం | గంధం |
| వాక్కు | పాణి | పాదం | గుహ్యం | పాయువు |

పృథ్విలో బృథ్విగూడిన బాయువును, బృథ్విలో నుదకంబు గూడిన గంధంబును, పృథ్విలో నగ్నిగూడిన ఘ్రాణంబును, బృథ్విలో వాయువుగూడిన నపానవాయువును, బృథ్విలో నాకాశంబు గూడిన నహంకారంబును బుట్టెను.

ఉదకంబులో బృథ్విగూడిన గుహ్యమును, నుదకములో నుదకంబు గూడిన రసంబును, నుదకంబులో నగ్ని గూడిన జిహ్వయు, నుదకంబులో వాయువుగూడిన బ్రాణవాయువును నుదకములో నాకాశంబు గూడిన జిత్తంబును బుట్టెను.

అగ్నిలో బృథ్విగూడిన బాదంబును నగ్నిలో నుదకంబు గూడిన రూపంబును నగ్నిలో నగ్ని గూడిన చక్షువును, నగ్నిలో వాయువు గూడిన నుదాన వాయువును, నగ్నిలో నాకాశంబు గూడిన బుద్ధియుం బుట్టెను.

వాయువులో బృథ్విగూడిన పాణియు, వాయువులో నుదకంబు గూడిన స్పర్శంబును, వాయువులో నగ్ని గూడిన త్వక్కును, వాయువులో వాయువు గూడిన వ్యానవాయువును, వాయువులో నాకాశంబు కూడిన మనస్సును బుట్టెను.

ఆకాశంబులో బృథ్విగూడిన వాక్కును నాకాశములో నుదకంబు గూడిన శబ్దమును, నాకాశంబులో నగ్నిగూడిన శ్రోత్రంబును, నాకాశంబులో వాయువు గూడిన సమాన వాయువును, నాకాశంబులో నాకాశంబు గూడిన జ్ఞాతయు బుట్టెను.

ఈ జ్ఞాతయే సమాన వాయువునుం గూడుకొని శ్రోత్రేంద్రియంబు ద్వారా శబ్దమును గుర్తెఱింగి వాగింద్రియంబు ద్వారా వచియించుచున్నది.

ఈ జ్ఞాతయే మనోరూపకమై వ్యాన వాయువు గూడి త్వగింద్రియము ద్వారా స్పర్శమును గుర్తెఱిగి పాణీంద్రియంబు ద్వారా యిచ్చిపుచ్చుకొను చున్నది.

ఈ జ్ఞాతయే బుద్ధిరూపకమై యుదాన వాయువుంగూడుకొని, చక్షురింద్రియంబు ద్వారా రూపంబును గుర్తెఱిగి పాదేంద్రియము ద్వారా గమనాగమనంబు చేయుచున్నది.

ఈ జ్ఞాతయే చిత్తరూపకమై ప్రాణవాయువుం గూడి, జిహ్వేంద్రి యంబు ద్వారా రసంబును గుర్తెఱిగి గుహ్యేంద్రియము ద్వారా యానందించు చున్నది.

ఈ జ్ఞాతయే యహంకార రూపకమై యపానవాయువుం గూడుకొని, ఘ్రాణేంద్రియము ద్వారా గంధమును గుర్తెఱిగి పాయురింద్రి యంబు ద్వారా మలవిసర్జనము చేయుచున్నది.

## జ్ఞానేంద్రియములకు విషయములు

శ్రోత్రమునకు విషయంబు శబ్దంబు త్వక్కునకు విషయము స్పర్శంబు, చక్షువునకు విషయము రూపంబు, జిహ్వకు విషయంబు రసంబు, ఘ్రాణమునకు విషయము గంధము.

## కర్మేంద్రియములకు విషయములు

వాక్కునకు విషయంబు వచనంబు, పాణికి విషయంబు దానంబు, పాదంబునకు విషయంబు గమనము, గుహ్యమునకు విషయమానందము. వాయువునకు విషయము మలవిసర్జనము.

## అంతరింద్రియములకు విషయములు

మనస్సునకు విషయము సంకల్పము. బుద్ధికి విషయము నిశ్చయము. చిత్తమునకు విషయము చింతన, అహంకారమునకు విషయ మహంకర్తృత్వము.

## పంచకోశముల వివరణము

అహంకారము సమిష్టితో గూడిన నన్నమయకోశము ప్రాణేంద్రియ ములతో గూడిన ప్రాణమయకోశము, మనస్సు కర్మేంద్రియ ములతో గూడిన మనోమయ కోశము, బుద్ధి జ్ఞానేంద్రియములతో గూడిన విజ్ఞానమయ కోశము, చిత్తము జ్ఞానముతో గూడిన నానందమయకోశము.

## ఆత్మకు, స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములు కలిగియుండుట

జ్ఞానేంద్రియములైదును, కర్మేంద్రియము లైదును, పంచతన్మాత్ర లును, ప్రాణవాయువు లైదును, నంతరింద్రియములు, నగునీ యిర్వదైదు తత్త్వములు గల్గినదే స్థూల శరీరము, దీనికి విశ్వుడని నామము.

జ్ఞానేంద్రియము లైదును, శబ్దాదులైదును, ప్రాణాదులైదును, మనోబుద్ధులును, నగునీ పదునేడు తత్వములను గలిగినదే సూక్ష్మశరీరము. దీనికి దైజసుండని నామము.

చిత్తము జ్ఞాతతో గూడినదే కారణ శరీరము. దీనికి ప్రాజ్ఞుడని నామము.

స్వయంజ్యోతియై సర్వసాక్షియై నిలిచిన శుద్ధచైతన్యము మహాకారణ శరీరము, దీనికి హిరణ్య గర్భుడని నామము.

## ముప్పదియారు తత్త్వముల చక్రము

| | | | | | |
|---|---|---|---|---|---|
| కామం | జ్ఞానం | మనస్సు | బుద్ధి | చిత్తం | అహంకారం |
| క్రోధం | సమానం | వ్యానం | ఉదానం | ప్రాణం | అపానం |
| లోభం | శ్రోత్రం | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణం |
| మోహం | శబ్దం | స్పర్శం | రూపం | రసం | గంథం |
| మదం | వాక్కు | పాణి | పాదం | గుహ్యం | పాయువు |
| మత్సరం | వచనం | దానం | గమనం | ఆనందం | విసర్జనం |

## పంచభూతముల స్థానములు

పృథ్వియను మహాభూతము గుదస్థానంబున పీతవర్ణంబై యుండును.

ఉదకమను మహాభూతము లింగస్థానంబున శ్వేత వర్ణంబై యుండును.

అగ్నియను మహాభూతము నాభి స్థానంబున ధూమ్రవర్ణంబై యుండును.

వాయ వను మహాభూతము నాభికిమీదుగా నీల వర్ణంబై యుండును.

ఆకాశమను మహాభూతము శిరస్థానంబున సర్వవర్ణములు గలిగియుండును.

## జ్ఞానేంద్రియములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| శ్రోత్రేంద్రియమునకు | ఆకాశభూతం | దశదిక్కులు అధిదేవతలు | శబ్దమే విషయం | క్షరాక్షరములు | 2 | శబ్దభేదములు |
| త్వగింద్రియమునకు | వాయుభూతం | రుద్రుండు అధిదేవత | స్పర్శమే విషయం | శీతం,ఉష్టం,మృదు కఠినములు | 4 | స్పర్శభేదములు |
| చక్షురింద్రియమునకు | అగ్నిభూతం | సూర్యుడు అధిదేవత | రూపమే విషయం | శ్వేత, పీత హరితరక్త, మజ్జిష్ఠ, కృష్ణ | 6 | రూపభేదములు |
| జిహ్వేంద్రియమునకు | ఉదకభూతం | వరుణుడు అధిదేవత | రసమే విషయం | మధుర, ఆమ్ల, తిక్త, కటు,కషాయ,లవణములు | 6 | రసభేదములు |
| ఘ్రాణేంద్రియమునకు | పృథ్వీభూతం | అశ్వినీదేవతలు అధిదేవతలు | గంధమే విషయం | సుగంధ దుర్గంధములు | 2 | గంధభేదాలు |

## కర్మేంద్రియములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వాగింద్రియమునకు | నాగవాయువు | సరస్వతి అధిదేవత | వచనమే విషయం | సువాక్య దుర్వాక్యములు | 2 | వచనభేదములు |
| ప్రాణేంద్రియమునకు | కూర్మవాయువు | దేవేంద్రుడధిదేవత | దానమే విషయం | దానా దానములు | 2 | దాన భేదములు |
| పాదేంద్రియమునకు | కృకురవాయువు | విష్ణువు అధిదేవత | గమనమే విషయం | గమనా గమనములు | 2 | గమనభేదములు |
| గుహ్యేంద్రియమునకు | ధనంజయ వాయువు | బ్రహ్మప్రజాపతి అధిదేవత | ఆనందమే విషయం | ఆనంద కేవలా నందములు | 2 | ఆనందభేదములు |
| పాయురింద్రియమునకు | దేవదత్త వాయువు | మృత్యువధిదేవత | విసర్జనమే విషయం | జలమల విసర్జనములు | 2 | విసర్జనములు |

## పంచభూతముల వలన బుట్టిన వాని వివరణము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పృథివి వలన | అస్తి | చర్మం | మాంసం | నరములు | రోమములు | – | 5 కలిగెను |
| ఉదకము వలన | రక్తం | మూత్రం | శుక్లం | శ్లేష్మం | మెదడు | – | 5 కలిగెను |
| అగ్ని వలన | క్షుత్తు | పిపాస | నిద్ర | ఆలస్యం | సంగమం | – | 5 కలిగెను |
| వాయువు వలన | చలనం | గమనం | తీవ్రం | లజ్జ | భయం | – | 5 కలిగెను |
| ఆకాశము వలన | కామం | క్రోధం | లోభం | మోహం | మదం | మత్సరం | 6 కలిగెను |

## దశవిధ నాడుల - వివరణములు

| | | | |
|---|---|---|---|
| 1 | ఇడానాడి-(అనగా చంద్రనాడి, ఎడమ భాగమందుండును. శివుడు - అధిదేవత | 6 | పూషానాడి-కుడికర్ణమందుండును దిగ్దేవత - అధిదేవత. |
| 2 | పింగళనాడి-(అనగా సూర్యనాడి), కుడి భాగమందుండును. విష్ణువు-అధిదేవత | 7 | పయశ్వినీనాడి-ఎడమ కర్ణమందుండును. పద్మోద్భవుడు - అధిదేవత |
| 3 | సుషుమ్న నాడి-(అనగా అగ్నినాడి) మధ్యమందుండును. బ్రహ్మ - అధిదేవత | 8 | అలంబననాడి - మేఢ్రమందుండును. వైశ్వానరుడు - అధిదేవత. |
| 4 | గాంధారినాడి - కుడినేత్రమందుండును, ఇంద్రుడు - అధిదేవత | 9 | కుహూనాడి - గుదస్థానమందుండును. భూమి - అధిదేవత. |
| 5 | హస్తినాడి - జిహ్వయందును, నెడమనేత్ర మందును నుండును, వరుణుడు-అధిదేవత | 10 | శంఖినీనాడి - నాభిస్థానమందుండును. చంద్రుడు - అధిదేవత. |

## సప్త వ్యసనములు

| | |
|---|---|
| తనువ్యసనం | దేహభారము సంభవించి కలవరించుట |
| మనోవ్యసనం | మనోవికారము కలిగినప్పుడు దొంగతనమైనను జేయగోరుట |
| ధనవ్యసనం | ధనము సంపాదించ వలయునని లోభకాంక్షతో నుండుట |
| రాజ్యవ్యసనం | మనోత్సాహమును బొంది వాహన వస్త్రాభరణములను ధరియించి<br>యేమో యేలాగో – అవునో కాదో – యని మనంబునం జింతించుట |
| విశ్వవ్యసనం | మోక్షమును నాధించవలె ననియును, దివ్యక్షేత్రములకుం బోవలెననియును జింతించుట |
| ఉత్సాహవ్యసనం | ఉత్సాహము కలిగినప్పుడు పుత్రమిత్ర కళత్రాదుల మీద వాంఛించుట |
| సేవకావ్యసనం | పోయెద, వచ్చెద, నిచ్చెద, బుచ్చుకొనెదనని వినయమును బొందుట. |

## దశవిధ వాయువుల వివరణము వానిలో బంచ ప్రాణములు - 5

| | |
|---|---|
| సమానవాయువు | నీలవర్ణము–నాభిస్థానమందుండి యా పాదమస్తకమును వ్యాపించి యన్నము మొదలగు పదార్థముల యొక్క సారమును సమస్త నాడులకును బంచిపెట్టును |
| వ్యానవాయువు | గోక్షీరవర్ణము – సర్వాంగము వ్యాపించి దహమంతటను నిండియుండును |
| ఉదానవాయువు | సౌదామినీవర్ణము – కంఠమందుండి, కఫమును దగ్గునుబుట్టించును, రుచులు గోరించును, అన్నరసము నాత్మకు బావము చేయించును, కలవరించును |
| ప్రాణవాయువు | ఇంద్రనీలవర్ణము – హృదయమునందుండి, యంగుష్టము మొదలు వీణాగ్ర పర్యంతము వ్యాపించి, యుచ్ఛ్వాస, నిశ్వాసములచేత నన్నము జీర్ణము చేయించును. |
| అపానవాయువు | హరితవర్ణము – గుదస్థానమందుండి, మలమూత్రములను విడిపించి, అధోద్వారమును బంధించి, యన్నరసమును, సకల రోమనాడుల యందు వ్యాపింపజేయును. |

## ఉపవాయువులు - 5

| | |
|---|---|
| నాగ వాయువు | పీతవర్ణము - చలనము లేక గీతరాగాదులు జేయించును, రోమ నాడులయందుండును |
| కూర్మ వాయువు | శ్వేతవర్ణము - పాదంబులందుండి శుష్కమైన దేహమును బుష్టి చేయించును. కన్నులు నోరు మూయించును, దెఅపించను గర్తయై యుండును. |
| కృకర వాయువు | రక్త వర్ణము - నాసికాగ్రమందుండి క్షుదాది ధర్మములను బుట్టించును. గమనాగమనములు చేయించును. |
| దేవదత్త వాయువు | స్ఫటిక వర్ణము - గుహ్యనేత్రములయందుండి, కూర్చుండిన చోటనే పరుండబెట్టును. లేపి నిలిపించును, వ్యక్తముగా మాట్లాడించును. |
| ధనంజయ వాయువు | నీలవర్ణము - బ్రహ్మస్థానమందుండి, కర్ణరంధ్రములలో, బ్రవేశించి సముద్రముభంగ జిత్రవిచిత్రములుగా ఘోషించును. మరణ కాలమునకు ముందుగా నిర్ఘోషమై పోవును. |

## ఊర్ధ్వ లోకములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| భూలోకం గుదమందు | భువర్లోకం గుహ్యమందు | సువర్లోకం నాభియందు | మహర్లోకం హృదయమందు | జనర్లోకం కంఠమందు | తపోలోకం భ్రూమధ్యమందు | సత్యలోకం లలాటమందు |

## అథో లోకములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అతల అరికాళ్ళయందు | వితల మునిగాళ్ళయందు | సుతల మడిమలందు | తలాతల పిక్కలయందు | రసాతల మోకాళ్ళయందు | మహాతల తొడలయందు | పాతాళ గుదమందు |

## సప్తద్వీపములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| జంబూద్వీపం తలలో | ప్లక్షద్వీపం అస్థుల | శాఖద్వీపం శిరస్సున | శాల్మలీద్వీపం చర్మాన | పుష్కరద్వీపం గోళ్ళయందు | కుశద్వీపం మాంసమునందు | క్రౌంచద్వీపం వెంట్రుకలందు |

## సప్తసముద్రములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| లవణసముద్రం మూత్రము | ఇక్షుసముద్రం చెమట | సురసముద్రం ఇంద్రియం | సర్పిసముద్రం శోణితం | దధిసముద్రం శ్లేష్మం | క్షీరసముద్రం చొల్లు | శుద్ధోదకసముద్రం కన్నీరు |

| అంత:కరణము - ఉత్పత్తిపంచకము |
|---|
| ఆత్మ - ఆకాశముతో గూడి జ్ఞానము పుట్టెను. క్షేత్ర పాలకుడు-అధిదేవత సర్వసాక్షియై యుండును. |
| ఆత్మ - వాయువుతో గూడి మనస్సు పుట్టెను చంద్రుడు - అధిదేవత. |
| ఆత్మ - అగ్నితో గూడి బుద్ధిపుట్టెను బ్రహ్మ - అధిదేవత. |
| ఆత్మ - ఉదకముతో గూడిన చిత్తము పుట్టెను. విష్ణువు - అధిదేవత |
| ఆత్మ - పృథివితో గూడి యహంకారము పుట్టెను. రుద్రుడు - అధిదేవత. |

| షడ్భావ వికారములు | |
|---|---|
| అస్థితే | గర్భమును ధరించుట |
| జాయతే | జఠర కోటర పీటమందుండి వెడలి వచ్చి పుట్టుట. |
| వర్ధతే | మాయా మమకారంబుగప్పి దినదినంబున వర్థిల్లుట. |
| పరిణమితే | మాతా పితృ బంధుజనంబులకు సంతోషమును బుట్టించుట. |
| అపక్షియ్యతే | వృద్ధిపొందిన శరీరము దినక్రమంబుగ క్షీణమగుట |
| వినశ్యతే | దేహమును విడిచి వ్యర్థమైపోవుట. |

## పంచాగ్నుల వివరణము

| | | | | |
|---|---|---|---|---|
| కలాగ్ని<br>పాదములయందు | క్షుదగ్ని<br>నాభియందు | శీతాగ్ని<br>హృదయమందు | కోపాగ్ని<br>నేత్రములయందు | జ్ఞానాగ్ని<br>ఆత్మయందు |

## షడాధారముల వివరణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆధార కమలం నాలుగు – దళ ములు, నాలుగ క్షరములు (వ,శ,ష,స) గుద స్థానం | స్వాధిష్టకమలం ఆఱు – దళములు ఆఱు – అక్షరములు (బ,భ,మ,య,ర,ల) లింగ స్థానము | మణిపూరక కమలం పది దళములు పదియక్షరములు (డ,ఢ,ణ,త,థ,ద,ధ, న,ప,ఫ) నాభిస్థానం | అనాహతకమలం 12 దళములు 12 అక్షరములు క,ఖ,గ,ఘ,ఙ,చ, ఛ,జ,ఝ,ఞ,ట,ఠ, హృదయస్థానం | విశుద్ధ కమలము 16 దళములు 16 అక్షరములు (అఆ,ఇఈ,ఉ,ఊ, ఋౠ,ఎఏఐ,ఒఓఔ అంఅః) కంఠస్థానం | ఆజ్ఞేయకమలం రెండు దళములు రెండక్షరములు (హం,క్షం,) భ్రూమధ్య స్థానం |

## దశ విధ నాదములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జలధి ఘోష | భేరి నాదం | చిణీ నాదం | మృందగ నాదం | ఘంటా నాదం | కాహళ నాదం | కింకిణీ నాదం | వేణు నాదం | భ్రమర నాదం | ప్రణవనాదం ఓంకారము |

| పరబ్రహ్మము బ్రహ్మాండ పిండాండములను గల్పించిన విధము | | |
|---|---|---|
| ఈశాన్య ముఖమందు | ఆకాశము పుట్టెను | పరమాత్మ |
| తత్పురుష ముఖమందు | వాయువు పుట్టెను | జీవాత్మ |
| అఘోర ముఖమందు | అగ్నిపుట్టెను | అగ్నిదేవుడు |
| వామ దేవముఖమందు | ఉదకము పుట్టెను | చంద్రుడు |
| సద్యోజాతముఖమందు | పృథివి పుట్టెను | సూర్యుడు |

| ఓంకార ప్రకరణము | | | |
|---|---|---|---|
| ఆకారం | బ్రహ్మ | పీతవర్ణం | నాదం |
| ఉకారం | విష్ణువు | శ్వేతవర్ణం | బిందువు |
| మకారం | శివుడు | కృష్ణవర్ణం | కళ |

| అష్టమదములు | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కులం | బలం | ధనం | రూపం | యౌవనం | విద్య | రాజ్యం | తపస్సు |

**అజప (21600 – కి భాగ వివరణము**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| గుద స్థానమున గణపతికి 600 | లింగస్థానమున బ్రహ్మకు 6000 | నాభిస్థానమున విష్ణువునకు 6000 | హృదయస్థాన మున శివునకు 6000 | కంఠస్థానమున జీవునకు 1000 | భ్రూమధ్యమున ఆత్మకు 1000 | లలాటమున సద్గురువునకు 1000 |

**త్రిగుణముల వివరణము**

| | | |
|---|---|---|
| రజోగుణం | రక్తవర్ణం | శ్రోత్రాదిపంచ అధ్యాత్మలు పుట్టినవి. |
| సత్వగుణం | శ్వేతవర్ణం | సూర్యచంద్రాది దేవతలు పుట్టిరి. |
| తమోగుణం | కృష్ణవర్ణం | శబ్దాది పంచతన్మాత్రలు పుట్టినవి. |

**అంతరింద్రియ స్థానముల వివరణము మరియు త్రినాడులు**

| | | | |
|---|---|---|---|
| జ్ఞాత | చక్షుస్థానం | సుషుమ్న నాడి | మహామేరుగిరి |
| మనస్సు | కంఠస్థానం | పింగళనాడి | మందరగిరి |
| బుద్ధి | ముఖస్థానం | ఇడానాడి | కైలాసగిరి |
| చిత్తం | నాభిస్థానం | | |
| అహంకారం | హృదయస్థానం | | |

ఉద్ధవా, సాంఖ్యసూత్రమైన పంచీకరణమును జక్కగా దెలుసు కొమ్మని సర్వమును వినిపించెను. ఆ యుద్ధవుండు ఆశ్చర్యపడి, స్వామీ, పంచభూతముల వలనం గల్గిన తత్త్వములన్నియు నెఱింగించితిరి. వాని లయమును, బంచభూతములు లయించు క్రమమును, బోధించుదని యడిగిన నా భగవంతుండిట్లనియె.

## ఇంద్రియములు లయించు క్రమము

ఆకాశముయొక్క బయలాంశముతో బృథివియొక్క కఠినాంశము కూడిన వాక్కు లయము. పృథ్వి యొక్క కఠినాంశము వాయువుయొక్క చలనాంశముతో గూడిన పాణిలయము పృథ్వియొక్క కఠినాంశం బగ్నియొక్క తేజాంశముతో గూడిన పాదము లయము, పృథ్వి యొక్క కఠినాంశ మప్పుయొక్క ద్రవాంశముతో గూడిన గుహ్యాము లయము. అప్పుయొక్క ద్రవాంశ మాకాశము యొక్క బయలాంశముతో గూడిన శబ్ద లయము. అప్పుయొక్క ద్రవాంశము వాయువుయొక్క చలనాంశముతో గూడిన స్పర్శలయము. అప్పుయొక్క ద్రవాంశ మగ్నియొక్క తేజాంశముతో గూడిన రూప లయము. అప్పుయొక్క ద్రవాంశము పృథ్వియొక్క కఠినాంశముతో గూడిన గంధము లయము, అగ్నియొక్క తేజాంశ మాకాశము యొక్క బయలాంశముతో కూడిన శ్రోత్రము లయము. అగ్ని యొక్క తేజాంశమున వాయువుయొక్క చలనాంశముతో గూడిన త్వక్కులయము. అగ్నియొక్క తేజాంశం బప్పుయొక్క ద్రవాంశముతో కూడిన జిహ్వాలయము, అగ్నియొక్క తేజాంశము పృథ్వియొక్క కఠినాంశముతో గూడిన ఘ్రాణ లయము. వాయువుయొక్క చలనాంశమప్పుయొక్క ద్రవాంశ ముతో గూడిన బ్రాణము లయము, వాయువుయొక్క చలనాంశము పృథ్వియొక్క కఠినాంశముతో గూడిన నపానము లయము. ఆకాశము యొక్క బయలాంశం బప్పు యొక్క ద్రవాంశముం గూడిన జిత్తము లయము. ఆకాశము యొక్క బయలాంశ మగ్నియొక్క తేజాంశముతో గూడిన బుద్ధిలయము. ఆకాశము యొక్క బయలాంశము వాయువు యొక్క చలనాంశముతో గూడిన మనస్సు లయము. ఈ ప్రకారము సమష్టి భూతంబులన్నియు లయించిన పిదప.

## వ్యష్టి – పంచభూతములు లయించు క్రమము

భూమి యనెడు పాయువు జలమందును, జలమనెడి రసమగ్ని యందును, నగ్నియనెడు చక్షువు వాయువందును. వాయువనెడు వ్యానవాయువు ఆకాశమందును, ఆకాశమనెడు జ్ఞాత మహాకాశమందును లయించునని శ్రీకృష్ణభగవానుం డాయుద్ధవునకు సాంగంబున బోధించెను.

ఈ సాంఖ్యసూత్రమును సాంగంబుగ సద్గురుకటాక్షంబున గ్రహించిన దేవమానవులు సాలోక్యపదవినింబొంది, సుఖానందము లనుభ వింతురు. సందియములేదు. ఇదియే ప్రథమదీక్ష.

ఇది వేదాంతసారుండను, మహాయోగ పురుషుండును, బ్రకృతి
ద్వయదోష రహితుండును, నచలుండును, నశరీరుండునైన
సద్గురుస్వామి కటాక్షంబున పోకల – శేషాచలా
హ్వాయుం డాంధ్రంబున రచించిన శ్రీకృష్ణోద్ధవ
సంవాదమందలి సాంఖ్యసూత్రము సంపూర్ణము.

---

శ్రీమద్వేదాంతసారుండును, బ్రకృతిద్వయ దోషరహితుండును, నాదబిందు కళాతీతుండును, సచ్చిదానంద రహితుండును, నచల పరిపూర్ణండు నునైన శ్రీకృష్ణ దేవునకు నుద్ధవుండు సాష్టాంగ నమస్కారములు గావించి, ముకుళిత హస్తుండై దేవదేవోత్తమా! సాంఖ్య సూత్రమువలన మాంసపిండ మును మంత్ర పిండముగా జేసి, నన్ను సాలోక్య పదవినిం బొందించితిరి. ఆత్మా నాత్మలను బోధించి, నన్ను సామీప్యపదవినిం బొందించుడని పెక్కు విధముల వినుతించిన, నా భగవాను, డుద్ధవా! నిర్మలచిత్తుండవై వినుమని యిట్లనియె.

## సామీప్యపదవికి మార్గమైన ఆత్మానాత్మా వివేకము

ఉద్ధవా, 'ఆయామాత్మాబ్రహ్మ' మను మహావాక్యమునుబట్టి యాత్మ యే చైతన్యమనియును బ్రహ్మమనియును దెలియవచ్చుచున్నది. కాబట్టి చైతన్యమే పరబ్రహ్మము. చైతన్యమే ముక్తికాంత, చైతన్యమే యాదిశక్తి, చైతన్యమే

నారాయణమూర్తి, చైతన్యమే యాపోజ్యోతి, చైతన్యమే పరమశివుడు, చైతన్యమే రాజహంస, చైతన్యమే పరమహంస, చైతన్యమే జీవహంస. చైతన్యమువలననే శబ్దము. శబ్దమువలననే పలుకు పలుకే ప్రణవము, ప్రణవమే బిందువు, బిందువు వలననే నాదము, ప్రణవమువలననే త్రిగుణములు, త్రిగుణముల వలననే సంకల్ప వికల్పములు, సంకల్ప వికల్పముల వలననే సర్వప్రపంచ మునుం గల్పితమైనది. నామరూపములు గలదియే ప్రపంచము. సర్వప్రాణు లకు జైతన్యమే మూలము. చైతన్యమైన యెఱుక పురుషునకు మూలము లేదు. తనంత తానే వచ్చిన స్వయంభువు, అట్టి స్వయంప్రకాశమానుడైన యెఱుక పురుషుండే చైతన్య స్వరూపుడు, చైతన్య స్వరూపుండే సర్వప్రాణుల యందును నాత్మ విధంబున నుండుటంబట్టి, సర్వప్రాణులను జేతనులని చెప్పంబడుచున్నవి.

చేతనులయందు దేవతలును మానవులును చతుష్పాద ద్విపాద జంతువులును, బక్షులును జలచరములును, ప్రాకెడు జంతువులు సహా సర్వప్రాణులును, వృక్షలతాదులును బ్రహ్మసృష్టియై యున్నవి. అచేతన సముదాయ మనంగా - ప్రాణములేని నిర్జీవ పదార్థము లన్నియును మానవసృష్టియై యున్నది. దేవనిర్మితములైన చేతనములే విశేషములుగాని, మానవనిర్మితములైన యచేతనములు విశేషములుగావు.

ఆత్మ స్వయంప్రకాశమాను డగుటచేత నాత్మయే సర్వసాక్షి, ఆత్మ స్వంతంత్రు డగుటచే నాత్మయే నాటక ధారుడు. ఆత్మ సర్వేంద్రియములకును నాధార మగుటచేత నాత్మయే సూత్రధారి, ఆత్మయే పరమాత్మ యగుటచేత నాత్మయే మోక్షాది పదవులనిచ్చెడు, దేవుడు ఆత్మయే గురుడు. ఆత్మయే తండ్రి, ఆత్మయే తల్లి, కాబట్టి తల్లి, తండ్రి, గురువు దేవుండని చెప్పంబడి యున్నది. తల్లి బిడ్డకు దండ్రిని జూపించినటుల, గురుడు శిష్యునకు దేవునిం జూపించ వలయును. అటుల దేవునిం జూపించిన వాడే గురుడు, గురుడే యాచా ర్యుడు, ఆచార్యుడే దేశికోత్తముడు, అట్టి దేశికోత్తమునియందే మోక్షాది పద వులన్నియు నుండుటనుబట్టి, యాచార్యుని బరబ్రహ్మ స్వరూపమనియు, నాది శక్తియనియు నారాయణమూర్తి యనియు బరమ శివుడనియు, భావించి, యా మహాత్మునకు వివిధ శుశ్రూషలు గావించుచు, భృత్యుని

కైవడి వర్తించుచు. నతని యాజ్ఞాప్రకారములను కార్యములను జరిపించ వలయును, దేవునిం జూపించెడు నచలగురుడు కుల హీనుండుగా నున్నను బంచముడుగా నున్నను, శ్వపచుడుగానున్నను, నతడే బ్రాహ్మణుండు, బ్రహ్మ జ్ఞానము వలననే బ్రాహ్మణుడుగాని, కులమువలనంగాదు, మాదిగ వాడైన మతంగ మహర్షి, ఋషులలో గొప్పవాడు బ్రహ్మమును దర్శించినవారే బ్రాహ్మణులు, అహంకారము లేనివారే బ్రాహ్మణులు, బ్రహ్మజ్ఞానులైన పరమ గురువుల కులగోత్ర నామధేయములను విచారించుటే నరకము. సర్వప్రాణులు మలమూత్రములలో వర్ధిల్లి మూత్ర ద్వారమునుండియే జన్మిం చుటనుబట్టి మానవులందఱును సమానులే గాని, కొందఱు తక్కువ, కొందఱెక్కువ, యనిలేదు. వారి వారి వివేకమునకే హెచ్చు తక్కువలుగాని, కులము వలన హెచ్చు తక్కువలు గావు. కాబట్టి వివేకమును బ్రహ్మ జ్ఞానమునుగల పుణ్యపురుషుని సద్గురునిగా భావించి యందు నధికముగా నాత్మ ప్రకాశించుటను బట్టి, సర్వ ప్రాణులకంటెను మనుష్యులే యుత్తములు గావున, మానవుడు జీవకారుణ్యమును గలవాడై, యుక్తా యుక్తములను, ధర్మాధర్మములను, పుణ్య పాపములను, స్వర్గ నరకములను, బంధ మోక్షము లను దెలుసుకొని, పరస్పర పాత్రములకు సహించి, కించిజ్ఞులైనవారు శాస్త్రజ్ఞులను నాశ్రయించి, వారి వలన శాస్త్ర విచారణచేసి, తమకించిజ్ఞత్వ ములను విడిచి, శాస్త్రజ్ఞులు గావలయును అట్టి శాస్త్రజ్ఞులైన వారనుభవజ్ఞుల వలన నాత్మా నాత్మా వివేకములను గ్రహించి, యనుభవము గలవారలై విశేషజ్ఞులు గావలయును. ఆత్మ కోటిలో విశేషజ్ఞుడును శ్రేష్ఠుడునునైన మానవుడే సద్గురుండుగానుండి రహస్యములను జెప్పకుండిన నెవరు చెప్పుదురు? పరమ శివుండైనను నారాయణమూర్తి యైనను గురు స్వరూప మును ధరియించి యాత్మ ధర్మములను వెల్లడిచేయకుండిన నెటుల మనము గ్రహింపవచ్చును. మానవులయందే దైవత్వమును, రాక్షసత్వమును గలిగి యున్నది. ఆత్మా నాత్మా వివేకమును బొంది, శాంత శమదమాది గుణముల చేత ప్రవర్తించు వారందఱును, దేవాంశ సంభూతులనియును, జీవ కారుణ్య మును నాత్మా నాత్మా వివేకములేక కోపడంబ దురహకారములతో ప్రవర్తించు వారు, రాక్షసాంశ సంభూతులనియు జెప్పంబడుదురని చెప్పిన నా

యుద్ధవుండు గ్రహించి స్వామీ, చేతనులయందలి ప్రయోజనములను దెలుసుకొంటిని. అచేతన సముదాయము లెట్టివి? వాని యందలి ప్రయోజన ములను జెప్పి నన్ను జననమరణ ప్రవాహము నుండి తొలగించు భారము మీదియని వినయవంతుడై ప్రార్థించిన నా భగవంతుండిట్లనియె.

ఉద్ధవా, మానవ నిర్మితములైన వస్తురూపములన్నియును నచేతనములు, వాని యందాత్మ యుండుటలేదు. పంచ లోహములను జిత్ర విచిత్రంబులైన వస్తు రూపంబులతో నానా విధంబులుగా మనుష్యుని వలనం జేయబడుచున్నవి. మ్రానెండబెట్టబడి దారువుగాను నానావిధం బులైన వస్తు రూపంబులుగాను జేయబడుచున్నది. ఇవి యన్నియు నచేతనం బులు, ఆత్మా నాత్మా వివేక జ్ఞానము లేని యిక్ష్వాకు మహారాజు పరస్పర వ్రాతంబులకు సహించక పెద్దలను నిందించి మానవ నిర్మితమైన ప్రతిమను జేయించి, దానికి నారాయణుడని పేరుపెట్టి పూజించుట చేత బాపము సంభవించి ధర్మదేవత మూడు పాదములతో వర్తించెను. పిమ్మట శ్రీరామ చంద్రునకు నగస్త్య మహర్షి యాత్మ సంతర్పణంబే నారాయణ సంత ర్పణంబనియు, నాత్మ సంతుష్టియే నారాయణ సంతుష్టియనియు, నారాయణమూర్తి శరీరములనెడి పురములగల్పించు కొని తా నాత్మ విధంబున నున్నాడనియు, జేతనులైన పెద్దలను బూజించి యాత్మ సంతర్పణంబులు గావించక యచేతనములైన దారు పాషాణ లోహాది ప్రతిమలం బూజించుట పాపమనియు బోధించి, యా విగ్రహారాధన విభీషణునకు నిప్పించి మరల నాత్మ పూజలను, నాత్మ సంతర్పణంబులును గావించునటుల జేయించి, ధర్మ దేవతను నాలుగు పాదములతో వర్తింపజేసి నటుల బ్రమాణము లున్నవి. గాబట్టి ప్రతిమారాధనకంటె నాత్మారాధన మిగుల విశేషము.

చైతన్యమును గుఱించియే నాల్గు మహా వాక్యములును జెప్పుటను బట్టియు, త్రిమూర్తులు సహా సర్వ శరీరములకు చైతన్యమే యాధార మగుటచేతను, చైతన్యమే బ్రహ్మస్వరూపమనియు, చైతన్యము వలననే లోకాలోకములనియు, ప్రపంచమునకు చైతన్యమే కారణమనియు దెలియ వచ్చుచున్నది. కాబట్టి చైతన్య విహీనమైన ప్రతిమలను దేవులుగా భావించుటెట్లు? అండపిండ బ్రహ్మాండమంతయు నిండి నిబిడీకృతమైయుండు

పరిపూర్ణ బ్రహ్మము ప్రతిమల యందుండదాయని భావించుటెట్లు? ఎందును నిండియుండు పరిపూర్ణునకు నామరూపముల గల్పించుట యెట్లు? ఆహా! మిగుల జిత్రము ప్రతిమారాధన మంధాధికారులకు భ్రాంతి రూపకమై యున్నదనుటకు సందియము లేదు. ఆత్మానాత్మ వివేకముగల భక్తియోగ జ్ఞానులను నచలులను పూజించుటయు, వారికి ధూపదీప నైవేద్యములు గావించుటయు, ధర్మ మార్గములు అనగా మోక్షమునకు ద్రోవలని యాత్మోపదేశ మంతయు గావించి యుద్ధవా!యాచార్యుడుండు స్థానమే దివ్యక్షేత్రము. ఆచార్యుని శ్రీపాద జలమే మహాతీర్థము. ఆచార్యుని భుక్తశేషమే మహాప్రసాదంబని యాచార్య ప్రభావమంతయు నెఱింగించెను.

ఇది సకల నిగమాగమ శాస్త్ర విచారణుండును, మహా యోగ పురుషుండును, జ్ఞానసంపన్నుండును, బ్రకృతి ద్వయ దోష రహితుండును, నచల పరిపూర్ణుండునునైన సద్గురు కటాక్షంబున బోకల శేషాచలాహ్వాయు డాంధ్రంబున రచియించిన శ్రీకృష్ణోద్ధన సంవాద మందలి యాత్మానాత్మ వివేకము.

సంపూర్ణము.

శ్రీ మద్వేదాంతసారుండును, మహాప్రభుండును, నుపాధిద్వయదోష రహితుండును, నచల పరిపూర్ణుండునునైన శ్రీ కృష్ణదేవునకు నుద్ధవుండు సాష్టాంగదండప్రణామంబు లాచరించి, ముకుళితహస్తుండై, యో దేవ దేవోత్తమా, దీన శరణ్యా, భక్తజనరక్షకా, దాసుండనైన నాకు నాత్మానాత్మ వివేకమును బోధించి, సారూప్యపదవినిం బోధించితిరి. ఆహా! నా కెందును సంశయములేదు. సామీప్యపదవికిం బోయెడు నానందభావమును బోధించి, నన్ను ధన్యునిగా జేయుడని ప్రార్థించినంత, నా భగవానుడు మందస్మిత ముఖుండై యిట్లనియె.

## సారూప్య పదవికి మార్గమైన ఆనందభావము

ఉద్ధవా, 'ఆనందో బ్రహ్మ' మను శ్రుతిని ననుసరించి, యానందమే పరబ్రహ్మస్వరూపమని తెలియవచ్చుచున్నదిగదా! పెద్దలానంద మనియును, గేవలానంద మనియును, రెండు విధములుగా జెప్పుదురు. ఆ రెంటిలో

మొదటిదియైన యానందభావమును వినుము భూలోకమున వివిధ సుఖములను బొందియుండుట యానందముకాదు. స్వర్గలోకమున వివిధ సుఖములనుభవించుట యానందము కాదు. సుందరమైన యౌవన స్త్రీలతో భోగించుట యానందముకాదు. చిత్రవిచిత్రములైన వస్తువులను జూచుట యనందముకాదు. సతీ, సుత, సోదర, బంధువర్గముల తోడనుండుట యానందముకాదు. ఒంటరివాడై యుండుటయును నానందముకాదు. సర్వ ప్రాణులయందును, నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానంద మయములను పంచకోశము లుండును గనుక, మానవుడై ధన కోశమైన యానందమయ కోశమునందే విహరించిన ముక్తికలుగును. చిత్తము జ్ఞానముతో గూడుటే యానందము. కాబట్టి నీవెందును భ్రాంతిలేని వాడవై రాత్రి మూడవజామున నిద్రమేల్కొంచి, వివిక్త ప్రవేశమునం గూర్చుండి, గురుమంత్రమును జపించుచు, రెండు చేతివేళ్లను శ్రోత్రేంద్రియములలో జొనిపి, నీయందుండెడు, జలధి, నాదము, భేరీనాదము, ఛిణీనాదము, మృదంగనాదము, ఘంటానాదము, కాహళనాదము, కింకిణీ నాదము, వేణునాదము, భ్రమర నాదము, ప్రణవనాదమును నీ దశవిధ దేవవాద్య ములను వినుము. అట్టి నాదబ్రహ్మమునందు నీ మనస్సును సంధింప జేయుము. నాదమే సత్తు, నీవే చిత్తు, ఈ సత్తు చిత్తుల నేకీభవింపం జేసినవాడే సచ్చిదానందమూర్తి, నాదానందసుఖమే బ్రహ్మానంద సుఖము, మనస్సునకు నాదానంద సుఖముతప్ప వేఱొండు సుఖములేదు ఆనందములేదు. ముక్తి కాంతామణి సహస్రార కమలమందుండి బ్రహ్మదండి యనెడు వెన్నెముకను వీణాదండంబుగాను, ఆధార స్వాధిష్ట మణిపూరకానాహత విశుద్ధాజ్ఞేయ ములను, షడాధారములను, నట్టి వీణాదండమునకు మెట్లుగాను, పంచ బ్రాణములు తంత్రులుగాను నొనర్చి నిశ్చలముగా నావీణెను మీటు చుండును. ముక్తికాంత వలనం గలిగిన నాదములగుట చేత, నవి దేవవాద్య ములని చెప్పంబడును. నీవు నీలోక సుఖములను తుచ్ఛ సుఖములు గాను, నీలోక వాద్యములు మనోవికారములుగాను భావించి, కేవల సుఖానందమైన సమాధియందు నిశ్చయముగానుండి, దేవవాద్యములను వినుచు, నీ చిత్తమును లీనముగావింపుమని చెప్పి చూపించెను. ఆ యుద్ధవుండు సమాధి

యందు నిలిపి యా పలువిధములైన నాదములయందును జిత్తములు నిలిపి వినుచు, నాసద్గురుస్వామికి దండప్రణామంబులు గావించి, స్వామీ, నాదానంద ప్రభావమంతయును జెప్పుడని వేడిన, నా భగవానుండిట్లనియె.

ఉద్ధవా, నాదానందమే సుఖానందము, నాదానందమే సంతోషము, నాదానందమే సర్వపాపక్షయము, నాదానందమే పుణ్యము, నాదానందమే నిత్యము, నాదానందమే సత్యము. నాదానందమే ధర్మము, నాదానందమే మనోనిర్మలము, నాదానందమే యింద్రియజయము, నాదానందమే బంధు నాశము, నాదానందమే జన్మపావనము, నాదానందమే నిష్కామము, నాదానందము యిష్టసిద్ధి నాదానందమే త్రిలోక పూజ్యత. నాదానందమే శత్రునాశము. నాదానందుని ద్రిలోకములవారును బూజించెదరు. నీ వితర భ్రాంతులను విడిచి, వైరాగ్య పరుండవై శంఖచక్రములకు మధ్య, మిగుల సొంపుతో ఘోషించెడు నాదబ్రహ్మమును వినుము. నేత్రములను మూసుకొని త్రికూటస్థానమున దృష్టి నిలుపుము. నాద బ్రహ్మమునందు బిందుస్వరూపమైన చిత్తమును గూర్చుటే కళ. నీవే కళాస్వరూపుండవు. నాదమనెడు నీశ్వరుని యందు బిందువనెడు జీవునిం గూర్చుటే జీవేశ్వరైక్యము. జీవేశ్వరైక్యమే బ్రహ్మసిద్ధియని నాదబ్రహ్మానందమును జక్కగా బోధించెను.

ఇది శ్రీమద్వేదాంతసారుండును, నాదబిందుకళాతీతుండును, నుపాధిద్వయ దోషరహితుండునునైన సద్గురుని కటాక్షంబున, పోకల - శేషాచ లాహ్వయు డాంధ్రంబున, రచియించిన శ్రీకృష్ణోద్ధవ సంవాదమను ఆనందభావము సంపూర్ణము.

శ్రీ మద్వేదాంత సారుండును, మహాజ్ఞాన పురుషుండును నాదబిందు కళాతీతుండును, బ్రకృతిద్వయదోష రహితుండనునైన శ్రీకృష్ణ దేవునకు నుద్ధవుండు సాష్టాంగనమస్కారమును జేసి, యంజలీబద్ధుండై, మహాత్మా, యానంద భావమును రాత్రివేళ, రహస్య ప్రదేశమునం గూర్చుండి, దివ్యము లైన వాద్యములను వినుచు, మిగుల సుఖానందుడవై యున్నాడు. ఐనను నవి కల్పసమాధి యగుటం జేసి, యా కాలమందు దప్ప దక్కిన కాలములలో, నాదానంద సుఖము లేనందుచేత నా చిత్తమునకు విశ్రాంతి మార్గము కలుగక నానా విధములైన చింతలను బుట్టించుచున్నది. కేవలానంద

మార్గమును బోధించి, నా చిత్తమునకు విశ్రాంతి మార్గమను గ్రహించి దానిని బొందించుమడని ప్రార్థించిన నా భగవానుండిట్లనియె.

## సాయుజ్యపదవికి మార్గమైన కేవలానంద భావము

ఉద్ధవా, కేవలానందవే నిత్యానందము, నిత్యానందవే బ్రహ్మానందము, నిత్యానందమే నిర్వికల్ప సమాధి. తొల్లి పెక్కండ్రు పుణ్యపురుషు లట్టి కేవలానందమైన నాదబ్రహ్మంబును, సర్వకాల సర్వావస్థల యందును శోత్రములను మూయకయే వినుచు జిత్తానందమును బొందుచు, సర్వవృత్తులను జేయుచు, నాదబ్రహ్మము నందు జిత్తమును జొప్పించి, దశవిధములైన నాదములను వినుము, తొల్లి, అహా - ఊహూ - అను గంధర్వ శ్రేష్ఠులును, వసిష్ఠాది మహా ఋషులును, జనకుఁడు మొదలగు రాజఋషులును, హరిశ్చంద్రుఁడు మొదలగు చక్రవర్తులును, దిలీపుఁడు మొదలు షోడశ మహారాజులును, సూర్య సేనుఁడను రాజును నాదానంద సుఖము లనుభవించి సుకీర్తినిం జొందిరి.

## సులోచనుండను రాజుపుత్రుని చరిత్రమును వినుము

తొల్లి సులోచనుండను రాజపుత్రుఁడు భూసంచారముఁ జేయుచుఁ గొన్ని దినములకు బదరికాశ్రముఁ జేరి యందు సమాధినిష్ఠా గరిష్ఠులైన మహాఋషులఁ గాంచి, వారికి సాష్టాంగ నమస్కారములను గావించి, మహాత్ములారా, లోకంబునం గొందఱు నీతిపరులు స్త్రీలతో భోగించుటయే బ్రహ్మానంద సుఖంబని చెప్పుదురు. నా మనంబునకు సందియమగు చున్నది. పుణ్యాత్ములైన మీరు కేవల సుఖానంద మెద్దియో యానతిచ్చితిరేని నేనట్లు వర్తింతునని వినయుఁడై ప్రార్థించెను. ఆ మహా ఋషులలోఁ బులోముండను మహాఋషి, చిఱునగవుతో నారాజపుత్రుని నాదరించి, బిడ్డా! నీవు తొల్లి జన్మమునందుఁ జేసిన పుణ్యవశంబును, నీ మనంబునకు నిట్టి ప్రశ్న కలిగెను. ధీరుండవై వినుము. స్త్రీలతో భోగించుట యానందమని పామర జనులును మదాంధులును బలుకుదురు గాని, నీతిపరులు పల్కరు, పదునాలుగు లోకముల యందును, నాదానంద సుఖమున కంటెను వేఱొండు సుఖంబు లేదు. నీవవి నీతుల వాక్యములు వినక నీ పురింకింబోయి పెద్దల సాంగత్యమును బడసి విచారణ చేయుము పొమ్మని యాజ్ఞాపించిన నా

రాజపుత్రుడు, మహాత్మా! మీవంటి మహాత్ముల దర్శనమును సాంగత్యమును విడిచి, యవినీతుల సాంగత్యమును జేయ నొల్లను. పురియెల్లను, జననీ జనకుల నొల్లను, నేను స్త్రీల మీఁది మమకారము గలిగిన దురహంకారుం డను, మందప్రజ్ఞుండను, నన్నుఁ బాప సంఘంబుల జిక్కకుండునటులఁ జేయవే యని పెక్కు విధంబుల వినుతించెను. ఆ ఋషి శ్రేష్ఠుండు కరుణగల వాఁడై హస్తమస్తకనుసందాన యోగమును జూపించి, బిడ్డా! యీ యోగ భావము వలనఁ బక్షము దినములలో నాత్ముఁడు శరీరమును విడిచి పోవునట్టి గుఱుంతు గనుపట్టునని బోధించి, గురుమంత్రమును గటాక్షించి, రేచక పూరక కుంభ కాదులను జెప్పి చూపించి, సమాధి నిష్ఠనిం గావించెను. ఆ రాజపుత్రుఁడు పగలంతయు మహా ఋషిని శుశ్రూషలు గావించుచు, ఫలపుష్ప సమిధలను గొని వచ్చుచు, రాత్రుల సమాధి నిష్ఠాపరుండై నాద బ్రహ్మమును లేపుచు, నిటుల నొక సంవత్సరము నిండు వైరాగ్యపరుండై దశవిధ నాదములను లేపి, యా దేవ వాద్యములను వినుచుఁ బట్టగూడని యానందముచేత దిక్కులు గనుపించక యితర శబ్దములను వినక, యేమియును దోఁచక యుండుటను మహాఋషి గ్రహించి, బిడ్డా! నాదానంద సుఖములు దెలుసు కొఁటివిగదా! మిగుల శుష్కీభూతులై నీ తల్లి దండ్రులు దుఃఖించుచున్నారు. నీవు త్వరగాఁ బొమ్మని ప్రయాణముం జేసి యంపెను. ఆ సులోచ చనుఁడు మహాఋషి యాజ్ఞ ప్రకారము పురికింబోయి, జననీ జనకులకు సంతోషమును గావించి వారి యిష్టప్రకారము వివాహముఁ జేసికొని రాజ్యభారమును వహించి, యే విషయముల యందును మోహ పరుండుగాక సర్వసముండై నాదానంద సుఖమగ్నుండై, పెద్దలను బూజించుచు, బహుకాలము రాజ్యమును బాలించి, పుత్రీ, పుత్రులను గాంచి, లోకంబున జిరకీర్తినిం బడసి, శరీరమును విడిచి, సాయుజ్య పదవినింబొంది, బహుకాలము సత్యలోకమున సుఖానందముల నుభవించెను, అటుల నీవును ధీరుండవై కేవలానందమైన, నిరంతర నిర్వికల్ప సమాధినిం దెలియు మని యిట్లనియె.

ఉద్ధవా! తత్త్వమసి యను మహా వాక్యమునకు (అర్థము : త్వంపద మనగా – ఇరువది యైదవ తత్త్వమైన జ్ఞాతయనెడు జీవుండు. తత్ పదమనగా

– ఇరువది యాఱవ తత్త్వమైన జ్ఞానమనెడు నీశ్వరుండు. ఈ యిరువురు గూడుటే ఆసిపదము) జీవుడవగు నీశ్వరుండ వగుచున్నావని తాత్పర్యము కాబట్టి, జీవశబ్దవాచ్యుండవైన నీవు చిత్తుడవు ఈశ్వరవాచ్యమైనది నాదబ్రహ్మము, నాదబ్రహ్మము నందు జిత్తమును లీనముగావించుటే జీవేశ్వరైక్యము. ఈ ప్రకార మైక్య సమాధినిం బొందించిన పురుషుడే సచ్చిదానందమూర్తి. చిత్తమును విశ్రాంతిమార్గమున నిలిపిన వాడే యోగి. ఇంద్రియములను మఱలించిన వాడే యోగి. ఇంద్రియములకు మనస్సే రాజు. మనస్సే ప్రభువు, మనస్సును నాదబ్రహ్మమునందు జొప్పించిన వారే బ్రహ్మస్వరూపులు నాదమే బ్రహ్మము. అట్టి నాదబ్రహ్మమును, గర్ణ రంధ్రములను మూసి వినుటవలన సుఖములేదు. అట్టి దశవిధ నాదములు సమముగా వినిపించవు. కాబట్టి దశవిధములైన నాదములను బైటదీసి యానందించుటే బ్రహ్మానందము. నాదబ్రహ్మమే పదిశిరస్సులుగల ఘోరసర్పము. అట్టి ఘోర సర్పము యొక్క దశముఖముల యందును దశ విధములైన నాదములు వినవచ్చును. ఆ పెనుబాముచటం బెట్టెవలె జుట్టుకొని యుండును. ఆ పామును భేదించుటకు హంసయే యాధారము హంసయే బ్రహ్మము. హంసయే నాదబ్రహ్మమునకు దండ్రి, ముక్తికాంతయే తల్లి, హంసయే యాత్మారాముడు, ఈ హంసయే పరమహంస, ఈ పరమహంస దివారాత్రులను, గాలాకాలములను లేక, సర్వకాల సర్వావస్థలయందును నేకరూపంబు, నొక్కటే విధంబున, షడాధారములకు దంత్రి రూపకమై, యిడా పింగళ నాడులయందు సంచరించుచుండునని చెప్పి యాపరమ హంసనుం జూపించి, యుద్ధవా! ఈ పరమహంస మంత్రమును దెలియుమని యిట్లనియె.

ఓం, హ్రీం, శ్రీం, హం, సం, అను నీయైదు బీజాక్షరములే హంసపంచాక్షరీ మంత్రమని యామంత్రము యొక్క మంత్రార్థ, మంత్రమూల, మంత్రసారములను బోధించి, పుణ్యాత్మా, యీ మంత్రమే త్రిలోకపావనము ఈ మంత్రమే మహాపుణ్యము. ఈ మంత్రమును జపించుచు, రాత్రి మూడవ జామున రహస్య ప్రదేశమునం గూర్చుండి, నేత్రములను మూసుకొని, త్రికూటస్థానమును లక్ష్యమును నిలుపుకొని, రాం–బీజమునందు ధృక్కునిలిపి,

రేచకపూరకముల చేత హంసను జక్కగా నడిపించుచు, ద్వాదశాంగుళములు చిఱ్ఱున రేచించి యష్టాంగుళమును పూరించుచు గుంభకమున విశ్రమించుచు, జంటనాగస్వరములు నూదుచు, నిడా పింగళ నాడులయందు సంచరించెడు హంసయొక్క సంచార త్రోవలను నడ్డగించి, యితర మార్గమున జిఱ్ఱున రేచించుచు సూర్యుని, జంద్రనాడియందును, జంద్రుని సూర్యనాడియందును జిఱ్ఱున రేచించుచు నీ ప్రకారంబా చంద్రసూర్యులును జికాకు పఱచి, గంతులు తప్పించుచు, జంటతిత్తులనంటి యూదుచు, సర్పమునకుకాక పుట్టించుచు, నజపకుండలిని భేదించి, త్రేతాగ్నుల నేకీభవింప జేయుచుండుము శంఖచక్రములకు నట్టనడుమంబెట్టె బెట్టుకొని యుండెడు నాకోడెసర్పమచట నిలువజాలక ఝుంకారము జేయుచు, బైటవచ్చి దశవిధ నాదములను జేయుచుండును. అప్పుడు కలిగెడు నాదానంద మిట్టిదట్టిదని చెప్పుటకు బ్రహ్మాదులకైన నలవికాదు అదియే నిరంతర నిర్వికల్పసమాధి. అదియే మహదానందము. అదియే బ్రహ్మానందము. సర్వకాలములయందును, సర్వవృత్తులయందును, గర్ణ రంధ్రములను మూయకే యానాద బ్రహ్మానంద సుఖమును బొంద వచ్చునని, సర్వమును బోధించెను.

అంత నా యుద్ధవుండు నిందు వైరాగ్యముతో నభ్యసించి నాద బ్రహ్మమును లేపి, యా దేవవాద్యములను విని భరింప జాలక దిగ్భ్రమను జెంచుచు దిక్కులు దెలియంబడక నిశ్చేష్టితుండగుచు, నా సూర్యచంద్ర మండలములను దాటి సుషుమ్న నాళమున జొచ్చి, యత్యద్భుతమైన వింతలను జిదాకాశమును జూచుచు, మహాజ్యోతి ప్రకాశంబునుం గనుచు బట్టరాని బట్టబయలునకుం బ్రాకుచుం దనయను భవమంతయును సద్గురుస్వామికిం జెప్పెను. ఆ భగవానుండుద్ధవా!యిదియే మనాయాసము. ఇదియే రాజ మార్గము. ఇంతకంటెను వేఱొండు సులభమైన మార్గము లేదు. మంత్రయోగ మనియును, లయ యోగమనియును, హఠ యోగమనియును, రాజయోగ మనియును, నాలుగు విధములైన యోగములుగలవు. ఆ నాలుగు యోగ ములలో నీ రాజయోగమే శ్రేష్ఠము. ఈ రాజయోగమును రెండు విధము లుగా బెద్దలు చెప్పుదురు. రాజ యోగమనియు, మౌన రాజయోగమనియు, రెండు విధములు గలవు. రాజ యోగమునకు భూచరీముద్ర. ఖేచరీముద్ర,

షణ్ముఖీముద్ర, శాంభవీముద్ర, యంతర్లక్ష్యముద్ర యనెడు నీ పంచముద్రలే మార్గములై యున్నవి మౌనరాజు యోగమునకు నాత్మ ధ్యానమును, కుండలి యోగమును, నాదబ్రహ్మమునునైన దీని యానందించుటను, నీ మూడును మార్గములైయున్నవి. పంచముద్రల భావములు మిగుల గష్టమార్గములు, ఫలితార్థమును బొందుట మిగుల దుస్తరము. ఆత్మ ధ్యానమే మిగుల సునాయాసము. విశేషమైన ఫలితార్థమును బొందించునట్టిది. 'అహంబ్రహ్మాస్మి' యను నాత్మ ధ్యానమెంద్రైక్యసమాధి. ఆత్మధ్యానమే విశ్రాంతి మార్గము. అట్టి విశ్రాంతి మార్గమునే నీకు ననుష్ఠానము గావించితిని. కేవలానంద మార్గము సర్వంబును బోధించెను.

ఇది వేదాంతసారుండను, మహాజ్ఞానపురుషుండును, బ్రకృతి ద్వయదోష రహితుండును, నచల పరిపూర్ణుండునునైన సద్గురుమూర్తి కటాక్షంబున బోకల శేషాచలాహ్వయుం డాంధ్రంబున రచించిన శ్రీకృష్ణోద్ధవసంవాద మనెడు – కేవలానందభావము సంపూర్ణము.

---

శ్రీమద్వేదాంత సారుండును, ప్రకృతిద్వయ దోషరహితుండును, నచల పరిపూర్ణుండును, నశరీరుండునునైన శ్రీకృష్ణ దేశికప్రభు స్వాములవారికి నుద్ధవుండు సాష్టాంగ నమస్కారములు గావించి త్రిలోకనాయకా! సాక్షిత్వ పదవికిం బోయెడు రాజమార్గమును బోధించి, నన్ను గృతార్థునిగా జేయుం డని ప్రార్థించిన నా భగవంతుండిట్లనియె.

## సాక్షిత్వపదవికి మార్గమైన పరమహంస భావము

ఉద్ధవా, శబ్దబ్రహ్మమే నాదబ్రహ్మము. శబ్దబ్రహ్మమునకు నాధారము వాక్యబ్రహ్మము, వాక్యబ్రహ్మమే పరమహంస, పరమహంసయే యాత్మరాముడు. తొల్లి సుమిత్రుండను రాజునకు ఋషభాఖ్యుండను మహాఋషి బోధించిన పరమహంస భావమును శ్రద్ధాసక్తుండవై వినుమని యిట్లనియె.

## సుమిత్రుండను రాజు చరిత్రము

ఉద్ధవా! తొల్లి సుమిత్రుండను రాజపుత్రుండు విద్యలన్నియు నేర్చుకొని ధనుర్విద్యయందు మిగుల ప్రబుద్ధుండై ధర్మయుక్తముగ దన రాజ్యమును పాలించుచు నొకనాడుత్సాహపరుండై వేటకాండ్రతోడ నడవికిం

బోయి వన్యమృగం బులను వేటలాడుచు, విచ్చలవిడిం బాఱుచుబెబ్బులులను బడగొట్టుచు, మదపుటేనుగుల దొండములంట నరుకుచు భల్లూకములను బాఱదోలుచు, జింకల మీదికి లఘించుచు, దన పరిచారకులను బాసి తన యమ్ముననాటి పరుగిడుచుండిన మెకము వెంట తగిలి బహుదూరము పోయి క్షుత్పిపాసలకు దాళంజాలక యందొక మునిపల్లెను గాంచి తన గుఱ్ఱముందిగి నిశ్చేష్టితుండై యొక పొన్నమ్రాని నీడను గూర్చుండెను. ఒకింతసేపున నందలి ఋషిగణంబులా రాజపుత్రుని గాంచి యతని చెంతకువచ్చి యాదరించి మాధుర్య ఫలమును. నిర్మలోదకమును నిచ్చి తృప్తునిగా జేసిరి. అంత నాఋషులలో ఋషభుండను మహర్షి యతని ముఖమును వీక్షించి, రాజాత్మజా, నీవే కతంబు యీ వనంబునకు వచ్చుటకుం గతంబెద్ది? నీ మనంబు మిగుల విషాదముతో గుంది పరితపించుటకు గారణంబెద్ది? నాకు నిజము చెప్పుమని యడిగిన నా పుడమితేడతని పాదంబుల కెరంగి, మహాత్మా! నేను మృగయా వినోదపరుండనై వేటకాండ్ర తోడ నడవికివచ్చి విచ్చల విడిగా వేటలాడుచు, నా వేటకాండ్రను బాసి యొంటరివాడనై నా చేత నేటువడిన మెకము వెంటందగిలి దానిం బట్టెడు నాశచేత నింతదూరము వచ్చి గాసిపడితిని, ఆ మెకము నాకు నగోచరంబై యెందుబోయెనో తెలియదని పలికెను. ఆ మునీంద్రుడు చిఱునగవుతో నతనింగాంచి, యో రాజ రత్నమా, లోకంబునంగల మానవుల వివిధము లగు కోరికలనెడు, నాశా పాశబద్ధులై, తుచ్ఛంబులగు సుఖంబులకాశించి, సంసారాబ్ధిలో జిక్కువడి కేవల సుఖానందములగు మోక్షాది పదవులను మఱచి వ్యర్థముగా జచ్చుచు బుట్టుచుందురు. నీవును వారివలె మోహబద్ధుల సాంగత్యముచేత దుర్మోహమందు దగిలి చింతించుచున్నాడవు. నీ పూర్వజన్మ వృత్తాంతమును వినుము. నీవు పూర్వానుభవంబున సద్గురుని నాశ్రయించి మిగుల భక్తుండవై ప్రబోధింపబడిన కతంబున నట్టి పూర్వజన్మ సుకృతమే మృగరూపంబు ధరియించి, నీ చేత నేటువడి నిన్నిచటికిం గొనితెచ్చెను. నీవు మిగుల బుణ్యుండవని పలికెను.

అంతనా పుడమితేడు చిఱునగవుతో నా మహాత్ముని పాదముల మీద వ్రాలి మునినాయకా! దేవర వారు నాదుపూర్వజన్మ వర్తమానమును

జెప్పుటచేత నేను మిగుల సంతోష చిత్తుండనైతిని. ఈ జన్మంబున నేను దురిత దూషితుండనై సంకల్ప వికల్పంబులకు గారణమైన చిత్తమును నిరోధించి, కేవల సుఖానంద పదముంబొందునటుల జేయవే యని వినయ మతియై ప్రార్థించిన, నాముని సత్తముండు మందహాసముతో నతని మస్తకంబున దన హస్తంబునుంచి నీవు సుఖప్రాప్తుండ వగుమని దీవించి, కార్యాంగుళ్య సంధాన భావంబుజూపించి, యీ సంధానము నియోగ మగుటచేత సప్తరాత్రులకు మానవులకు మారకంబు సంభవించును. ఈ దేవరహస్యమును మఱవ వలదు. ఇదియునుంగాక యాత్మ ధ్యానమనెడు పరమహంస భావము త్రిలోకవిదితంబై త్రిమూర్త్యాత్మక సర్వస్వరూపంబై యుపశ్రుతి వాక్యంబై వెలయు. నీవు దీని ధరించి కేవలసుఖానంద పదవినిం బొందుమని యిట్లనియె.

**శ్లో॥ సప్తకోటి మహామంత్రా। చిత్తవిభ్రమకారకా।**
**ఏకయేవ పరోమంత్ర। గురురిత్య క్షరద్వయమ్॥**

అని చెప్పంబడియున్నది గనుక, సప్తకోటి మహామంత్రములకు మూలమంత్రమే యేకాక్షరియైన ప్రణవము. ఇదే తారకంబని చెప్పి సోహం భావమును గటాక్షించి, యీ యక్షర ద్వయముతో జిత్తసంధానంబు గావించి మౌనవ్రతుండవై జపించుచుండుము. నీవు సర్వసముండవై కేవల సాక్షిత్వపదవిం బొందుమన దీవించియంపెను. అంత నా మానవేంద్రు డుత్సాహమున దన పురంబున కేతించి సద్గురువాక్యమును మఱువ కనుష్ఠించుచు శాంతి శమదమాది గుణములు గలవాడై జీవకారుణ్యము గల్గి యాత్మ సంతర్పణంబులు గావించుచు, మిత భాషయును, మిత భోగమును, మిత భక్షణయును, మిత నిద్రయును గలిగి పుత్రీపుత్రులను గాంచి చిత్త విశ్రాంతిపరుండై దివ్య పదవినిం బొందెను, కాబట్టి నీవును నట్టి యాత్మ స్వరూపంబగు ప్రణవంబు ధరించి పుణ్యగతిం బొందుము.

ఆత్మా రాముడే పదునాలుగు లోకములకు నాధారభూతుడు ఆత్మా రాముడే సర్వేంద్రియములకు మూలము, ఆత్మా రాముడే ప్రకృతి ద్వయము. ఆత్మా రాముడే యుపాధి ద్వయము, ఆత్మా రాముండే ప్రపంచము. ఆత్మా రాముండే సర్వప్రాణులు. ఆత్మా రాముండే చైతన్యము. సర్వప్రాణులయందును

హంస స్వరూపుడైన యాత్మారాముడంతర్బహిర్వ్యాపకత్వము చేత సర్వకాల సర్వావస్థల యందును, నేక రూపముగా వెలుగు చుండును. ఆత్మారామ బ్రహ్మము షడాధారములకు దంత్రిరూపకమై, యారోహణహవరోహణ ములు కలిగి యిడపింగళ నాడుల యందు సంచరించు చుండును. ఆత్మారాముని రాకపోకల యందు శబ్దించెడు నక్షరములు రెండును దిరు మంత్రద్వయము. అట్టి తిరు మంత్రద్వయమే ప్రణవము, ప్రణవమే సోహము. సోహమే గురు కీలకము. ప్రణవమే యాత్మ ధ్యానము. ప్రణవమే వేదము. ప్రణవమే యుపనిష ద్వాక్యము, ప్రణవమే గాయత్రి, ప్రణవమే హంస, హంసయే పరబ్రహ్మము, ప్రణవమే ఉపశ్రుత వాక్యము, ప్రణవమే మహామంత్రము, ప్రణవమే యజప, ప్రణవమే రహస్యము, ప్రణవమే అహం బ్రహ్మోస్మి, ప్రణవమే జీవేశ్వరైక్యము. జీవేశ్వరైక్యమే యోగము. నాదబిందువుల కూడికే యోగము. సత్తుచిత్తుల సంధానమే యోగము, త్వంపద తత్పదముల వాక్యార్థమే యోగము, లక్ష్యార్థమే యోగము, హంసను త్రివేణీ సంగమమున బొందు పఱచుటే యోగము. సూర్యచంద్ర నాడులను గడచి, సుషుమ్న నాళమున హంసను నెక్కించుటే యోగము. ప్రణవాక్షర ద్వయమే యోగము, ప్రణవ ధ్యానమే యోగసిద్ధి. ప్రణవ శబ్దమే ఓంకారము, ఓంకారమే – అకార – ఉకార – మకారములు, అకారమే బ్రహ్మ, ఉకారమే విష్ణువు, మకారమే శివుడు. ఓంకారమే సర్వ ప్రాణులు, ఓంకారమే త్రిగుణములు. ఓంకారమే నాదము, ఓంకారమే బిందువు, ఓంకారమే కళ, ఓంకారమే ప్రపంచము, ఓంకారమే మహాతత్త్వము. సోహమే ప్రణవము, సోహమే బ్రహ్మము, సోహమే యాత్మ స్వరూపుడు, సోహమే పరమ పురుషుడు, సోహమే సచ్చిదానందమూర్తి, సోహమే గురుడు, సోహమే శిష్యుండు, సోహమే పరమాత్మ. సోహమే తిరుమంత్ర ద్వయము, సర్వ మంత్రములకు ప్రణవమే తల్లి, ప్రణవమే తండ్రి, ప్రణవమే సర్వము, ప్రణవమే పరమాత్మ, పరమాత్మయే తాను, అన్ని కులములందును బరబ్రహ్మ మొక్కడే యుండుటం బట్టి హెచ్చు తక్కువ కులములు లేవు. ఈ హంసుండే సర్వప్రాణులకు నాధారముగ నుండును. హంసకు గులములేదు, జాతిలేదు, ఆచారము లేదు, ప్రణవమును ధరించినవాడే పరమహంసుండు, ప్రణవ ధ్యానమే యాత్మ ధ్యానము, ఆత్మయే

నిర్వికారము, ఆత్మయేసాకారము, ఆత్మ ధ్యానమే మౌనము. ఆత్మ ధ్యానమే యమృతము. ఆత్మ ధ్యానమే మానవపూజ. ఆత్మ ధ్యానమే సర్వపాపక్షయము. ఆత్మ ధ్యానమే బంధు నాశము. ఆత్మ ధ్యానమే యింద్రియ జయము. ఆత్మ ధ్యానమే యంతరంగభక్తి. ఆత్మా రాముడు దివారాత్రులుంగల దినమునకు నిరువదియొక్క వేయి నాఱునూర్లు ప్రణవముగ నడుచుచుండును. గుదస్థాన మనెడు భూలోకమున నాధార కమలమునందు వల్లభశక్తి సహితుండైన గణాధిపతికి నాఱునూర్లు ప్రణవమును, లింగస్థానమనెడు భువర్లోకమున స్వాధిష్ఠాన కమలమునందు సరస్వతీ యుక్తుండైన బ్రహ్మదేవునకు నాఱువేలు ప్రణవమును, నాభి స్థానమనెడు సువర్లోకమున మణిపూరక కమలము నందు లక్ష్మీ యుక్తుండైన విష్ణుదేవున కాఱువేలు ప్రణవమును, హృదయస్థాన మనెడు మహర్లోకందున ననాహత కమలమునందు బార్వతీ యుక్తుండైన శివ దేవునకు నాఱువేలు ప్రణవమును, గంఠస్థాన మనెడు జనలోకమున విశుద్ధ కమలమునందు మాయాకాంతా యుక్తుండైన జీవునకు వేయి ప్రణవమును, త్రికూటస్థాన మనెడు తపోలోకమున నాజ్ఞేయ కమలమునందు నాదిశక్తి యుక్తుండైన యీశ్వరునకు వేయి ప్రణవమును, లలాట మనెడు సత్యలోకమున సహస్రార కమలమునందు సద్గురు స్వామికి వేయి ప్రణవమును నీ ప్రకారముగా నిరువదియొక్క వేయి నాఱునూర్లును భాగింపబడినవి. ఈ ప్రణవమే మహామంత్రము, ప్రణవ ధ్యానమే మౌనము. ప్రణవమును గర్మేంద్రియమైన వాక్కుతో జపము చేయగూడదు. జ్ఞానేంద్రియమైన జిహ్వేంద్రియముతో బ్రణవ ధ్యానమును జేయవలయును. ధ్యానము కర్మసహితముగా నుండిన గర్మమునకే కారణము. కర్మేంద్రియమైన నోరు ప్రణవ మంత్రమును జపించ నేరదు. జ్ఞానేంద్రియమైన జిహ్వేంద్రియమునకు బ్రణవమంత్రము మిగుల సునాయాసము. పెదవులను బంధించి, మారుతమును నియమించి, యిడా పింగళ నాడుల యందు సంచరించెడు హంసుని వెంట జిహ్వేంద్రియ మనెడు చిత్తమును సంధానమును గావించి, సదాకాలమును జపించు చుండుము. ఈ ప్రణవమే తారకము. ప్రణవమనెడు బంగారమునకును జిహ్వయనెడు వెలిగారమునకును సంబంధము కలుగునేగాని మఱియొక యింద్రియము

చేరనేరదు. ఆ జిహ్వేంద్రియమే చిత్తము. చిత్తమే మనస్సు, మనోమారుతము లకు సంధానమే సిద్ధము. మనోమారుతములకు సంధానము గావించిన నామమే తారకమంత్రము. సప్తకోటి మహామంత్రములను గర్మేంద్రిమైన వాక్కుతో ధ్యానించుట చేత ఫలితార్థము గలుగనేరదు. పెక్కంద్రు శివకేశవ నామములను ధ్యానింతుమని వారి వారి మనంబులను బెక్కు విధముల బ్రార్థించి దు:ఖించిరేగాని, యా మనంబెటుల ద్రిగుణములను ధ్యానించును? మనస్సు తనకు నాధారమైన యాత్మా రామునింబట్టి భజించునే గాని, యితరుల ధ్యానించదు, ఈ రహస్యము దెలియనేరక నరకావస్థలను బొందుచున్నారు. సద్గురుని కటాక్షంబున గురుకీలకమును గ్రహించి జపించుటే మనోధర్మము, సర్వేంద్రియములకు మనస్సు రాజు, మనస్సువలననే బంధ మోక్షములు, మనస్సువలననే ధర్మాధర్మములు, మనస్సువలననే జన్మము, మనస్సువలననే జన్మరహితము, మనస్సే జీవుండు. నామరూపములు గల సర్వమునకు నాధార భూతుండు జ్ఞానమే ఆత్మ జ్ఞానమే దేవుడు. జ్ఞానమే యీశ్వరుడు. జ్ఞానమే ఆత్మారాముడు. ఆత్మారాముడే కార్యకారణుండని పరమహంస భావమంతయును బోధించి, కుండలినీ యోగమును బట్టి చూపించి, పుణ్యాత్మా! యిదియే సాక్షిత్వ పదవికి రాజబాటయని సర్వమును బోధించి మౌన సమాధినిం బొందించెను.

ఇది శ్రీమద్వేదాంత సారుండును, మహాయోగపురుషుండును, ప్రకృతి ద్వయదోష రహితుండును, నచల పరిపూర్ణుండునైన, సద్గురుస్వామి కటాక్షమున, పోకల – శేషాచలస్వామి గురుడాంధ్రంబున రచియించిన శ్రీకృష్ణోద్ధవ సంవాద మనెడు – పరమహంసభావము

సంపూర్ణము

---

శ్రీమద్వేదాంత సారుండను, సర్వపరిపూర్ణుండును, నుపాధిద్వయ దోషరహితుండును, నచలుండును, నశరీరుండునునైన శ్రీకృష్ణదేశిక ప్రభు స్వాముల వారికి నుద్ధవుండు సాష్టాంగ నమస్కారములు గావించి, మహాత్మా, దేవర వారి యాజ్ఞ ప్రకారము నిరంతర నిర్వికల్ప సమాధియైన మౌనమును ధరియించి సర్వకాలంబుల నాత్మారాముని ధ్యానించుచు, రాత్రివేళల

గుండలినీ యోగమును జేయుచు, నేకతిత్తిని జలీయముగ నూదుచు, నజప కుండలిని భేదించి మధ్యబాటయందు దాండవమాడుచు, వేణునాదమును వినుచు, నూర్ధ్వకుండలిని దాటుచు జిత్కళలను మీఱి మండలములను గాంచుచు, మనస్సును నాదబ్రహ్మమునందు విలీనము గావించి, హంసను త్రివేణి సంగమమున నిలిపి, మహాజ్యోతిప్రకాశంబున గడచి, బట్ట బయలునకు బ్రాకనేర్చితిని ఆహా! ధన్యుండనైతిని. మోక్షమార్గమును గటాక్షించుడని వేడిన యంత నా భగవంతుండిట్లనియె.

## మోక్షమునకు మార్గమైన జ్ఞానస్వరూప భాగము

ఉద్ధవా, "ప్రజ్ఞనంబ్రహ్మ" మను మహావాక్యమును బట్టి ప్రజ్ఞానమె బ్రహ్మమని తెలియవచ్చుచున్నదిగదా. జ్ఞానము మూడువిధములు ప్రపంచ మును బ్రపంచములోని నామరూపములు గల సమస్తమును జూచి యెఱుంగుటచేతం బ్రపంచజ్ఞాన మనియును, శాస్త్రములవలనం దెలియుట చేత శాస్త్రజన్యజ్ఞానమనియును, నిర్వికారమై నివాతదీపమై యుండెడు నాపోజ్యోతుని గురుముఖంబునం దెలిసికొని, యా పరబ్రహ్మమును బ్రత్యక్షముగ దర్శించుట చేత, బ్రహ్మజ్ఞాన మనియును జెప్పంబడును. తొల్లియాత్మ నిష్ఠాగరిష్ఠులైన సనకాదులు పృథుచక్రవర్తికి బోధించిన యార్య దర్పణ భావమును నీకు బోధించెదను. నీవు శ్రద్ధాసక్తుండవై వినుమనిన నా యుద్ధవుం డంజలీ బద్ధుండై, మహాత్మా! వినిపింపుడని వేడిన, పరమ గురుండగు నా దేవకీనందనుండిట్లనియె

## పృథుచక్రవర్తి చరిత్రము

ఉద్ధవా! తొల్లిపృథుచక్రవర్తి భూమండల మంతయు నేకచ్ఛత్రంబున బాలించుననేక యజ్ఞ యాగాది క్రతువులను గావించి యనేక దానంబుల చేత దివిజులను, భూదేవోత్తములను సంతుష్టులుగా జేసియున్న, నొకనాడు మహాత్ములైన సనకాదులువచ్చుటెఱింగి వారికెదురేగి దోడ్కొనివచ్చి యుచితాసనంబుల గూర్చుండ నియమించి యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, మహాత్ములారా, యే కర్మంబున మోక్షంబు సిద్ధించు నానతిండని వేడిన, నా దివ్య ఋషులును రాజేంద్రా! యోగంబు వలనం గల్గును హంసను నాసాగ్ర మార్గంబునం గొనిపోయి యైక్యంబునుం బొందుట

దుస్తరంబు, దర్పణభావమనియును నార్యదర్పణ భావమనియు రెండు విధములు గలవు. వీనిలో దర్పణ భావము వలన బ్రతిబింబ చైతన్యుండై, నీలతోయదమందు సర్వము లీనమగుట గురు కటాక్షంబున నెఱింగి విద్యుల్లేఖయనబడు పరమాత్మ కళనుదర్శించి, నిష్కాళా రూపమైన పండువెన్నెలను గాంచి యదియే తాననియు, దానే పరమాత్మ యనియు, సచ్చిదానంద మనియు భావింతురేగాని, మా పోజ్యోతిని దర్శింపనేరరు. ఇదియును నిజమైన మార్గము కాదు. ఆర్యదర్పణ భావమే నిజంబని యా రాజేంద్రుని సమాధిలో నిలిపి యార్యదర్పణంబున బ్రతిబింబ చైతన్యమును, శుద్ధచైతన్యమైన నిజబింబమును దర్శించుమని కటాక్షించిరి, ఆ నరేంద్రుడు సునాయాసముగ నట్టి యాపో జ్యోతులను దర్శించి, మిగుల విస్మయము నొంది సర్వసాక్షియైన ద్రష్టను దర్శించితిననియూ మహాత్ములను గీర్తించి పూజించెను. వారు నీవే సర్వసాక్షివి, నీవే ద్రష్టవు. నీకు రెండవది లేదు ఏక సమాధినిం బొందిన యమనస్కుండవు. నీకు మోక్షంబు సిద్ధించుటకు సందియంబు లేదని దీవించి దివంబున కేగిరి.

అంత నా రాజేంద్రుడు సర్వసముండై యర్చియను తన పత్నితో నెల్ల సుఖములనుభవించుచు, గ్రమేణ నైదుగురు పుత్రులను గాంచి సత్పాత్రులకు వివిధ ధానంబులిచ్చుచు, నగ్నితో సమాన తేజంబును, భూదేవి వంటి యోర్పును, సముద్రమువంటి గాంభీర్యంబును, గుబేరునకువలె నవ నిధులును గలిగి, పురజనులకు రెండవ చంద్రుండునుంబోలె బహు వత్స రంబులు రాజ్యంబును బాలించి, పిదప మనోసంశయమును వైరాగ్యంబును గలవాడై తన పుత్రుల మీద రాజ్యభారమును నిలిపి, పురజనులు చింతా క్రాంతులయి పరిదేవనంబు చేయ, భార్యా సమేతుండై తపంబునకుం జని, యెండ కాలంబున బంచాగ్ని మధ్యమందును, వర్ష కాలంబున వస్త్రములం తృజించియు జలికాలంబున గుత్తుక బంటి నీరంబులను వసించియు నుగ్రమైన తపంబు గావించి, మోక్షంబును బొందెను. కాబట్టి సంశయంబు లేనివారికి, సంశయమున్న వారికి, నాపోజ్యోతి దర్శనము మోక్షమును బొందించును. నీవు లేశమాత్రంబేనియు సంశయము నొందవలదు, ఆ పృథుచక్రవర్తి సద్గురు వాక్యమును నిజమని నమ్మ కారణముచేత నడవికింబోయి వాన

ప్రస్థుండై దీర్ఘవైరాగ్యము నొంది యన్నపానాదుల వర్జించి యింద్రియములను గ్రుక్కించి, శరీరమును విడిచి మోక్షమును బొందెను. కాబట్టి యటుల జేయవలసినది లేదు. మనో నిశ్చయముగల పుణ్యాత్ములు, సంశయము లేనివారై, సమదృష్టి చేత, సర్వమును బ్రహ్మ స్వరూపమని దర్శించుచు నెందును వాంఛలేక, నిర్మోహులై యుండిన భయములేదు. గృహస్థానమే శ్రేష్ఠము. ఆపోజ్యోతియే సర్వసాక్షియై గుఱుతు నెఱుంగుచున్నది. సర్వమను గుఱుతు నెఱుంగు శుద్ధచైతన్య స్వరూపమును నెఱుకయని చెప్పబడును ఎఱుకే సర్వసాక్షి, ఎఱుకే నారాయణమూర్తి. ఎఱుకే సదాశివుడు. ఎఱుకే బ్రహ్మము, ఎఱుకే యాపోజ్యోతి. ఎఱుకే ప్రత్యగాత్మ, ఎఱుకే ద్రష్ట, ఎఱుకే జ్ఞానము, ఎఱుకే జ్ఞేయము. ఎఱుకే మహాలింగము, ఎఱుకే ముక్తికాంత, ఎఱుకే నివాతదీపము, ఎఱుకే జ్ఞానరత్నము, జ్ఞానమే మోక్షము, నాద బిందువులు గూడిన కళాస్వరూపమే సహస్రారము, సత్తు చిత్తులు గూడిన యానంద పట్టణమే సహస్రారము, గంగా యమునా సరస్వతులు గూడిన త్రివేణీ సంగగమే సహస్రారము సర్వమండలములకు నాలయమే సహస్రారము, సర్వవర్ణములు దిటిన స్థానమే సహస్రారము. ముక్తికాంత నివాసమే సహస్రారము, కన్నుల నడుమ వెలింగెడు నిక్షేపమే సహస్రారము. సహస్రారమే మోక్షస్థానము మనస్సు విలీయమైనచోటే మోక్షము. హంసాతీతమే మోక్షము. అహంవృత్తిరహితమే మోక్షంబు హంసయే బంధము, బంధరహితమే మోక్షము. మహాజ్యోతి ప్రకాశమే మోక్షము. గంగా యమునల మధ్య నల్లకలువ పూలయందలి తెల్ల దామరలలోని తేటయే నిక్షేపము. అదియే సర్వసాక్షి, అదియే యాపోజ్యోతి. ఆపోజ్యోతి దర్శనమే మోక్షము. అట్టి మోక్షమును దెలియుమని యార్యదర్పణమున నాపోజ్యోతులను జూపించినం జూచి, యా యుద్ధవుండు మిగుల నద్భుతమును నొంది, సద్గురుస్వామికి నమస్కరించి, మహాత్మా! యిదివఱ కెన్నడును నాకు గను పించని యీ బింబములు నేడు గనుపించుటకు గారణమేమని యడిగిన, నాకృష్ణభగవానుం, డుద్ధవా, యీ బింబములే జ్ఞానరత్నములు. ఇవియే సూర్యచంద్రులకు నాధారమైన యాపోజ్యోతులు. ఈ జ్యోతులవలననే సర్వమును గుర్తెఱుంగుట, ఆచార్య స్వాములవారి కటాక్షంబులేక యెంతటి

వారును నీ యాపోజ్యోతుల దర్శించనేరరు. సద్గురు కటాక్షము చేత, కామక్రోధ లోభ మోహ మద మత్సరములను దొంగలాఋగు రట్టి జ్ఞానరత్నముల విడిచి యిపుడు పాఱిపోయిరి, నీకు శత్రుక్షయంబాయెను. జ్ఞాన దీపములను బొడగంటివి. గురువాక్యములేక యెుంతటి వారికిని నీ జ్ఞాన దీపములు గనుపించవు. పురుషోత్తముండైన నారాయణమూర్తివే నీవు. ఆపోజ్యోతిరూపమే నీవు మహాలింగమే నీవు. నీవే సర్వసాక్షి స్వరూపుండవు నీవే కార్యకారణ పురుషుండవు. నీ స్వరూపమే మహాతేజము మహాతేజము నిష్కళ, నిష్కళయే తాను తానే పరమాత్మ. మహాతేజమే యోగము. మహాతేజమే జ్ఞానము. ఇదియే లక్ష్యార్థము, ఇదియే జీవేశ్వరైక్యము. ఇదియే వేదాంతము ఇదియే మహాతత్త్వము. ఇదియే థియోయోని ఇదియే పరమరహస్యంబని సర్వంబును బోధించెను.

ఇది శ్రీమద్వేదాంతసారుండును, మహాయోగపురుషుండును బ్రకృతి ద్వయదోష రహితుండును, నచల పరిపూర్ణుండునైన సద్గురుస్వామి కటాక్షంబున పోకల – శేషా చలాహ్వాయుం డాంధ్రంబున రచియించిన శ్రీకృష్ణోద్ధవ సంవాదమ నెడు జ్ఞానమార్గము సంపూర్ణము.

శ్రీమద్వేదాంతసారుండును, నచల పరిపూర్ణండును, నవాఙ్మానస గోచరుండును, నశరీరుండుసునైన శ్రీకృష్ణ దేశిక ప్రభుస్వాముల వారికి బరమ భక్తుండగు నా యుద్ధవుండంజలీబద్ధుండై, దేవ దేవత్తమా! నా మనంబునం గొంతనంశయము పుట్టుచున్నది. పెక్కండ్రు పుణ్య పురుషులు ఋగ్వేదమగు "ప్రజ్ఞానం బ్రహ్మ" మే బ్రహ్మ మనియును యజుర్వేద సారమగు "అహం బ్రహ్మాస్మి" యే బ్రహ్మమనియును, నథర్వణవేద సారమమగు 'అయమాత్మా బ్రహ్మ' యే బ్రహ్మమనియును, నీ నాలుగు మహా వాక్యములే బ్రహ్మస్వరూపం బనియును, ననుభవము లనియును జెప్పుదురు. దేవరవారు వేఱువేఱుగా వాని నిజస్థితిని బోధించి, నామనో మాలిన్యము దొలగించి రక్షింపుడని వేడెను.

**భగవానులు "ప్రజ్ఞానం బ్రహ్మ" మను**
**మహావాక్యమును నిరసనము చేయుట**

**శ్లో॥ జ్ఞానమజ్ఞా నందదృష్ట్వా ద్వయోస్త జతినిశ్చయం।**
**ద్వయోస్త్య జతియద్జ్ఞా నం తద్జ్ఞా నంచ పరిత్యజేత్॥**

అని పరమశివుని వాక్యము గనుక, జ్ఞానము నజ్ఞానమును జూచి జ్ఞానములను నిశ్చయముగా విడుచుచున్నది. ఈ జ్ఞానా జ్ఞానముల విడిచిన యే జ్ఞానమోయట్టి జ్ఞానముగూడి విడువ వలయును. కాబట్టి జ్ఞానా జ్ఞానములు రెండును బ్రహ్మము గాదు, జ్ఞాన మనెడు భాస్కరుండజ్ఞానమనెడు నంధకారమును బోనడంచు నప్పుడా చీకటి భాస్కరునియందే లీన మగుటచేత నా రెండును మాయయేగాని బ్రహ్మము కాదు. నిజమెఱిగిన మహాత్ములు బ్రహ్మమని చెప్పనే చెప్పరు. ఇది నిజగురు వాక్యము.

**భగవానులు "అహం బ్రహ్మోస్మి" యను**
**మహా వాక్యమును నిరసనము చేయుట**

**శో॥ శుద్ధేసుషుప్తావివచ। తస్మిన్నాహం కదాచన।**
**తద్వత్సదాపి యప్యాప్తి। ప్రపంచంనా ప్తితన్యపై॥**

అని పరమశివుని వాక్యము గనుక, నిర్మలమైన యచల పరిపూర్ణ బ్రహ్మమునందు సుషుప్త్యా ద్యవస్థలయం దుండెడు నే నెల్లప్పుడు లేనని యెవండు తెలుసుకొనుచున్నాడో యట్టి పుణ్యపురుషునకు నీ చూడంబడెడు ప్రపంచమ ప్రసిద్ధముగా లేదు. కాబట్టి అహం బ్రహ్మోస్మియను మహావాక్యము బ్రహ్మమేగాదు. అహ మనెడు జీవాహం కారమును దాననెడు నీశ్వరా హంకారమును. నీ రెండును ద్వంద పదములతో గూడిన మాటలేగాని బ్రహ్మముకాదు నిజమెఱిగిన మహాత్ములు బ్రహ్మమని చెప్పరు. ఇది నిజగురు వాక్యము.

**భగవానులు "తత్వమసి" యను**
**మహా వాక్యమును నిరసనము చేయుట**

**శ్లో॥ గురుణా వరణత్యాగః। అనావరణ ముత్తమం।**
**పరిపూర్ణం పూర్ణమేవ। పూర్ణాచల సముద్రవత్॥**

అని పరమశివుని వాక్యము గనుక జనుండు గురుమూర్తిచే శరీరేంద్రియాది యెల్లవృత్తులును గలిగిన ప్రకృతి పురుషులనెడ శరీరాత్మలను దీసివేయబడిన వాడై పరిపూర్ణమును నావరణ రహితమునునైన యచల స్వరూపుండై యున్నాడు. కాబట్టి తత్వమసియను మహావాక్యము మాయయేగాని బ్రహ్మముకాదు. నిజమెఱుంగని మాయావాదులు, నిజగురు వాక్యమును దెలియ నేరక నానా విధములుగా భాషింతురేగాని, వారు జాగ్రత్తను నెఱుగరు.

**భగవానులు "అయమాత్మా బ్రహ్మ" మను**
**మహా వాక్యమును నిరసనము చేయుట**

**శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా। దేహోనాస్తికదాచన।**
**అస్తినా స్తీతికో వేద। నిర్ణయోనాస్తి సర్వదా ॥**

అని పరమశివుని వాక్యము గనుక, నద్వయమైన యచల పరిపూర్ణము ప్రకృతి ద్వయముగల మాయా స్వరూపుండగు పరబ్రహ్మమునకు, వేఱుగా నుండుటం జేసి, కేవలాత్మకు శరీరాత్మలు లేవని యెవండు దెలియు చున్నాడో వాడే శరీరాత్మలు లేని మహాత్ముండు. వాడే యశరీరి, అచల బరిపూర్ణమునకు నిర్ణయంబులులేవు. గాబట్టి, 'అయమాత్మా బ్రహ్మ' మను మహా వాక్యము మూల మాయయేగాని బ్రహ్మముకాదు. ఆత్మయే నాలుగు విధములగు శరీరములకు మూలము. అట్టి యాత్మకు మూలము లేదు. భ్రమ స్వరూపంబై తోచుచుండును. ఇది స్వప్నమువంటిది. అనుభవమంత యును కల్ల, జాగ్రత్తయే పరిపూర్ణము. ఇది నిజగురు సాంప్రదాయకులకుం దప్ప నితరులకుం దెలియదు. ఎఱుకలోని వారు తమకు దెలియని దోషముచే నానా విధ ములుగా వాగ్వాదము లాడుదురని యీ నాలుగు మహా వాక్యములను నిరసనము గావించెను. అందులకు ఆ యుద్ధవుండంజలీ బద్ధుండై దేవ దేవోత్తమా! నా మనస్సంశయములు దీఱెను. ఇంక బరమపద మార్గమును బోధించి, నన్ను జనన మరణ ప్రవాహము నుండి తప్పించు భారము మీదియని పెక్కు విధముల వినుతించిన, యంత నా భగవంతుడు చిఱునగవుతో నిట్లనియె

## పరమపద మార్గము

ఉద్దవా! పరమపరమే నిజస్వరూపము "ఛిందంతినామ రూపాణి ఛిందంతి భువనత్రయ" మని యున్నది. గనుక, నామరూపములుగల సమస్త ప్రాణులును, మూడు లోకములను నశించునేగాని నిజస్వరూపమైన పరమపదము నశింపదు, చేతనములకును, నచేతన వస్తువులకును, నామ రూపములు చెడిపోవుటయే సిద్ధంబు. కాబట్టి యజ్ఞానము సుజ్ఞాన మందును, సుజ్ఞానము నాదమందును, నాదము పరమహంస యందును, బరమహంస సర్వసాక్షి యందును, సర్వసాక్షి పరిపూర్ణమందును లయించుటచేత, నిజ గురువాక్య మొక్కటే సత్యమగు పరమపదము. భ్రాంతివలననే జనన మరణ ములు. ఆచార్య కటాక్షము చేతగాని భ్రాంతి రహితము కానేరదు. గురు కటాక్షమే పరమపదము. ఏమియులేని పరమపదంబునందు బ్రపంచ మున్నదని చెప్పుట యధ్యారోపంబు, ప్రపంచమే భ్రాంతి. పరమపదమే యచల పరిపూర్ణ బ్రహ్మంబు, పరమపదమే యశరీర బ్రహ్మంబు పరమపదమే కేవలాత్మ. పరమపదమే నిరాలంబము. పరమ పదమే నిర్వికారంబు పరమపదమే బట్టబయలు, పరమపదమే కాలమందును బురుషుండుగాను, స్త్రీ గానునుండి మాయను బుట్టించలేదు. బుట్టించబడలేదు. చైతన్యహీనమైన పరమపద మెట్లు పుట్టించును? పరమపదంబు సర్వ కాలంబుల నొక్క విధంబుగానే యున్నది. కార్య కారణంబులు లేని పరమపద మెట్లు మాయను బుట్టించె? రజ్జువున సర్పభ్రాంతి కలుగుటచేతను, నా త్రాడు కార్యకారణంబుల నెఱుంగదు గదా! ఎండమావుల నీళ్లు దోచినట్లు, పరిపూర్ణ బ్రహ్మంబును బ్రపంచము తోచెనేగానీ, విచారణ చేయ కీభ్రాంతి విడువదు. ఆచార్య కటాక్షమే భ్రాంతిరహితంబు, భ్రాంతియే మాయ మాయయే యెఱుక పురుషుండు, ఎఱుకకు మూలంబు లేదు. తల్లి దండ్రులు లేక తనంత దానేవచ్చెను. అతడే గొడ్రాలు బిడ్డ. అతడే మూలంబు లేనివాడు. మూలంబు లేనిమాయ యెఱుక భ్రాంతి రూపమేగాని నిజంబుగా నున్నది కాదు. లేని ప్రపంచంబునకు నెఱుకే మూలంబు, ఎఱుకే యాపో జ్యోతి, ఎఱుకే ప్రకాశంబు, ఎఱుకే ద్రష్ట, ఎఱుకే యంతరాత్మ, ఎఱుకే యాది నారాయణమూర్తి, ఎఱుకే సదాశివుండు, ఎఱుకే సూర్యచంద్రులు, ఎఱుకే

జీవేశ్వరులు ఎఱుకే త్రిమూర్తులు, ఎఱుకే పంచభూతంబులు ఎఱుకే యాత్మారాముడు, ఎఱుకే సర్వసాక్షి. ఎఱుకే ప్రకృతి ద్వయంబు ఎఱుకే తల్లిదండ్రులు, ఎఱుకే వేదశాస్త్రములు. ఎఱుకే జనన మరణంబులు. ఎఱుకే బింబ ప్రతిబింబములు. ఎఱుకే లోకా లోకంబులు, ఎఱుకే కార్య కారణములు. ఎఱుకే జ్ఞాన కర్మంబులు, ఎఱుకే బంధ మోక్షములు. ఎఱుకే నామరూపంబులు ఎఱుకే నిత్యా నిత్యములు. ఎఱుకే త్రిలింగంబులు, ఎఱుకే భ్రాంతి, ఎఱుకే భ్రమ. ఆచార్య కటాక్షంబును బొంది నిజస్వరూపంబును గన్నవారికి భ్రాంతిలేదు. భ్రమలేదు, మాయలేదు పరమపదంబున కంటెను వేఱొందు లేదు. అంతయు బరమపదమే పరమ పదంబునకు రెండవది లేదు. పరమపదమే శాశ్వతంబు పరమపదమే మహాప్రభువు. చావు పుట్టుకలులేని యీ పరమపదమే దేవుండు వికారంబు లేనివాడే దేవుడు, నిర్వికార బ్రహ్మమే పరమపదంబు నామరూప రహితమే పరమపదంబు ఏమియును లేని నిరాలంబము పరమపదంబని మాయ వలనం చెప్పంబడెను.

నామరూప రహితమైన యీ పరమపదంబు జ్యోతి కాదు. ప్రకాశము కాదు. వెలుగు కాదు. చీకటి కాదు. నారాయణమూర్తి కాదు. సదాశివుడు కాదు. పరబ్రహ్మము కాదు. పరమాత్మ కాదు. ఆత్మకాదు. కళ కాదు. సత్తు కాదు. చిత్తు కాదు. ఆనందంబు కాదు, త్వంపదంబు కాదు. తత్పదము కాదు. అసి పదంబుకాదు. పంచభూంబులు కావు, ప్రణవంబు కాదు, గాయత్రి కాదు. ప్రకృతి కాదు. పురుషుండు కాదు, క్షరము కాదు. అక్షరంబు కాదు. క్షేత్రంబు కాదు. క్షేత్రజ్ఞుడు కాదు, మహాకారణంబు కాదు. కార్యంబు కాదు. జీవుండు కాదు. ఈశ్వరుడు కాదు. ఆకసంబు కాదు. వాయువు కాదు, అగ్ని కాదు. జలంబు కాదు. భూమి కాదు. ఏమియును గాని నామరూప రహితమైన పరమపదము నిర్వికారంబు, గనుక బలుకదు భాషింపదు, వినదు చూడదు. చేయదు చేయించదు, కర్తకాదు, కర్మకాదు, పెఱుగదు, తఱగదు అఱుగదు, కఱుగదు, తిఱుగదు, మొఱుగదు, పుట్టదు, గిట్టదు, కదలదు, మెదలదు, ఎండకు నెండదు, వానకు దడువదు, చలికి నులికి పడదు. కత్తికిం దెగదు. రాతికిం బగులదు, చేతల కందదు. మనంబు

నకు దగులదు. సర్వకాల సర్వావస్థలయందు నొక్కటే విధముగా నున్నది. యుగముల పర్యంతము యోచించినను భావమునకుం బట్టదు. యుక్తికిం జిక్కదు, శక్తికి సాధ్యముగాదు. కేవల నిర్వికారము గనుక జ్ఞానము కాదు. అజ్ఞానము కాదు. జ్ఞేయము కాదు. ద్రష్టయుంగాదు. విద్య కాదు. అవిద్య కాదు. శక్తి కాదు. వైరాగ్యము కాదు. యోగము కాదు. సమాధి కాదు. ముక్తి కాదు. అనుభవము కాదు. జపము కాదు. తపము కాదు. ముద్రలు కాదు. లక్ష్యము కాదు. హంస కాదు. సర్వసాక్షి కాదు. నాటక ధారుండు కాదు. సూత్రధారుండు కాదు. చైతన్యము కాదు. జడము కాదు. స్వర్గము కాదు. నరకము కాదు. బంధంబు కాదు. మోక్షంబు కాదు. పదవులు కాదు. పంచ బ్రహ్మలు కాదు. త్రిమూర్తులు కాదు. త్రిగుణములు కాదు. దేవతలు కాదు. ఋషులు కాదు. నరులు కాదు. గిరులు కాదు. తరులు కాదు. మృగములు కాదు. పక్షులు కాదు. కీటకములు కాదు. జలచరములు కాదు. వృక్షములు కాదు. దారువులు కాదు. పంచలోహములు కాదు. ప్రపంచము కాదు. నవరత్నములు కాదు. జగము కాదు. త్రిలోకములు కాదు. తీర్థములు కాదు. యాత్రలు కాదు. తిరుణాళ్ళు కాదు. కాశి కాదు, రామేశ్వరము కాదు. గుడి కాదు. గోపురములు కాదు. ప్రతిమ కాదు. విగ్రహము కాదు. శ్రవణము కాదు. మననము కాదు. నిధి ధ్యానము కాదు. నిష్ఠకాదు. వ్రతములు కాదు. తపములు కాదు. మంత్రము కాదు. తంత్రము కాదు. స్నానము కాదు. సంధ్య కాదు. విధి కాదు. విభేదము కాదు. పగలు కాదు. జాగరణ కాదు. స్వప్నము కాదు. నిద్ర కాదు. నిర్ణయము కాదు. తిథి కాదు. మాసము కాదు. సంవత్సరము కాదు. ఋతువు కాదు. పక్షము కాదు. అన్నమయ కోశము కాదు. ప్రాణమయ కోశముకాదు. మనోమయ కోశము కాదు. స్థూలము కాదు. సూక్ష్మము కాదు. కారణము కాదు. మహాకారణము కాదు. కర్మేంద్రియములు కాదు. జ్ఞానేంద్రియములు కాదు. పంచతన్మాత్రలు కాదు. పంచప్రాణములు కాదు. అంతరింద్రియములు కాదు. అరిషడ్వర్గము కాదు. గ్రహణములు కాదు. శక్తులు కాదు. అధిభూతములు కాదు. అధిదేవతలు కాదు. పతి కాదు. సతి కాదు. రతి కాదు. ఉపరతి కాదు. జడలు దాల్చుట కాదు. బోడి

చేసుకొనుట కాదు. మతములు కాదు. మతదేవతలు గాదు. వేషము కాదు. దిగంబరత్వము కాదు. సన్యాసము కాదు. గార్హస్థ్యము కాదు. వాన ప్రస్థము కాదు. బ్రహ్మచర్యము కాదు. మాటలు కాదు. మౌనము కాదు. వేదములు కాదు. శ్రుతులు కాదు. స్మృతులు కాదు. శాస్త్రములు కాదు. భాష్యములు కాదు. సూత్రములు కాదు. సుగుణము కాదు. నిర్గుణము కాదు. సూర్యమండలము కాదు. చంద్రమండలము కాదు. అగ్ని మండలము కాదు. అంతరము కాదు. బాహ్యము కాదు. నామ రూపములుగల సర్వమును కాదు. సర్వసూన్యమును కాదు. ప్రత్యక్షముగ గన్నుల కెదుటం గానుపించెడు పరమపద మెట్లగును? ఎఱుకే మఱుమాయముగా బోవునది గాబట్టి భ్రాంతి రూపకమైన యెఱుకే శూన్యముగాని, పరమపదము శూన్యము కాదు. లోకులు నామరూప మహిమల చేతనే మోసపోయి, మాయ యెఱుకను బ్రహ్మమని చెప్పెదరు. అచల బ్రహ్మమునకు నామము లేదు. రూపము లేదు. మహిమ లేదు. మంత్రము లేదు. ఏమియుండినను దోషమే. ఏ దోషము లేనిదే పరమపదము. పరమపదమే మహాప్రభువు. యుగముల పర్యంతము సమాధి నిష్ఠలు గావించిన మహర్షులకైనను బరమపద మిట్టి దిట్టిదని నిర్దేశింప రానిది. అవాఙ్మానస గోచరమైనది. ఎంతటి వారికి నలవిగానిది. సులువు గానిది. గురు కటాక్షములేక తెలియ గూడనిది. ఆహా! పరమపదము యొక్క చిత్రం యశరీరులకే తెలియునుగాని, చశరీరు లెట్లెఱుంగుదురు? ఎఱుక వలననే తెలుసుకొనుట. ఇట్లే తెలుసుకొనిన మాయ యెఱుకే మఱుమాయగా బోవును. ఎఱుక పోయిన వెనుక నంతయును పరమపదమే సర్వపరిపూర్ణ బ్రహ్మము. పరిపూర్ణమే బట్టబయలు, బట్టబయలే యచలము, అచలమే యశరీర బ్రహ్మము, ఏమియు గానిదే పరమపదము, ఎఱుక వలననే పరమపదమని చెప్పంబడినది. పరమపదము ప్రకృతి ద్వయము లేనిది. పరమపదము వికారము లేనిది. పరమపదము ద్వంద్వములు కానిది. పరమపదమే శాశ్వతము. పరమపదమే నిత్యము, కల్పనా రహితమే పరమపదము. పరమపదమే కాల మందును గుణములను బొంది మాయను బుట్టించలేదు. ఈ పెను మాయకు మూలము లేదు. తల్లి దండ్రులు లేక తనంతటదానే వచ్చినదిగాని నిజముగా బుట్టివచ్చినది

కాదు. నిజముగా నున్నది కాదు. భ్రాంతి వలననే వచ్చినట్టును బోయినట్టును దోచుచుండును. రాకపోకలకు భ్రమయే కారణము. కార్యమును భ్రమయే. కలలో వచ్చిన యేనుగులు, రాజులు, భటులు, స్త్రీలు, చిత్రవిచిత్రమైన వస్తువులును, మేల్కొన్న నొక్కటియైన లేదు. భ్రాంతియేగాని నిజముగా రాలేదు. నిజముగా బోలేదు. సర్వము భ్రాంతి, కలలో వచ్చిన శరీరములకు నీ శరీరములకు హెచ్చు తక్కువలు లేవు. గనుక గలలో వచ్చిన శరీరములను మూల మెట్లులేదో యటువలెనే సర్వశరీరములకు మూలము లేని యీ శరీరములకు గులము లేదు. గోత్రము లేదు. సూత్రము లేదు. తల్లి లేదు. తండ్రియు లేదు. "భ్రమమూల మిదంజగ" త్తని యున్నది గనుక, భ్రమ వలననే సర్వమును గల్పితములు. ఆహా? ఇట్టి మాయను దాటుటకు నెవ్వరి తరము? అందఱును మాయలోనే మునిగి యున్నారు. అచలమును బొందిన వారే మాయను గడిచిన వారు. పరమపదమును బొందిన వారే భ్రాంతిని విడిచినవారు. అచల పరిపూర్ణులే మాయను జయించిన వారు. ఆహా! వారి చిత్రమంతటి వారికే తెలియును గాని యితరులకుం దెలియంబడదు. లేనిమాయ లేనేలేదు. ఈ పరమపదం బుండకపోదు. సర్వకాలంబుల యందును, సర్వదేశంబుల యందును, సమస్త వస్తువుల యందును, బరమపద మెన్నడును జలింపక నిండియున్నది. పరమపదమే కేవలాత్మ వృత్తి శూన్యమే పరమపదము. నీవు నేను రహితమే పరమపదము. గురుశిష్యరహితమే పరమపదము. గురుకటాక్షమే పరమ పదము. ఆచార్యుని వాక్యమే జాగ్రత్త, సర్వపరిపూర్ణమే జాగ్రత్త. నీవు మిగుల సూక్ష్మ బుద్ధితో, బరాకుమాని జాగ్రత్త గలవాడవై ఎరుక రహితా చలము దెలియుమని శ్రీకృష్ణభగవానులు సౌంజ్ఞ చేసిరి. మిగుల జాగ్రత్త గలవాడైన యా యుద్ధవుండు తన సూక్ష్మబుద్ధిచేత గ్రహించి యా సౌజ్ఞలో నిలిపి, నామరూప రహితమైన పరమపదమును బొంది యద్భుత పరుండై, యహా! యిది తప్ప నేమిలేదని భావించి యేమియును దోచక నిశ్చేష్టితుండై కొంత తడ వూరకుండి సర్వలోక శరణ్యుండైన యా కృష్ణ దేశికునకు నమస్కరించి, స్వామీ! కేవలాత్మను దెలిసికొంటిని. ఆహా! ఏమో పరమపదము, నాకు బ్రకృతి ద్వయములేదు. అశరీరిని. నాకు జన్మము లేదు. కర్మము లేదు. బంధము

లేదు. మోక్షము లేదు. చావుపుట్టుకలు గల యెఱుకలేదు. పరమపదము వలన నెఱుక పుట్టింప బడలేదు. రెండవది లేదు. అద్భుతమైన పరమపదముం గృప జేసితిరి. నే లేని పరమపదమును దెలిసికొంటిని ఆహా! కలవాసి పోయె – నామ రూపములు లేకపోయె చిత్రములైన తళ్కు బెళ్క లెందుబోయె? నాదబ్రహ్మ మెందు లయించె? మండపము లెందు సమసె? జీవ్వేరు లెందు జొచ్చిరి? ముక్తికాంత యేమాయె? చైతన్య మెందడంగె! ఆదిశక్తి యెందుబోయె? నారాయణమూర్తి యెచట లయించె? పరమ శివుండెచటి కరిగె? హంస యెందు లయించె? సర్వసాక్షి యెందుజేరె? దృక్కు దృశ్యము లెందుబోయె? ఆహా! రూపనామములు గల సమస్తము రూప నామములు చెడి యీ పరమపదముననే లయించి పోవుచున్నవి అబ్బా! భ్రాంతివలననే జనన మరణములు. భ్రాంతి వలననే సుఖ దు:ఖంబులు, బంధమోక్షములు, భ్రాంతి లేని వారికీ పరమపదముకంటె వేఱొండు లేదు. అంతయు నీ పరమపదమే. యని యా దేశిక స్వాముల వారికి సాష్టాంగ నమస్కారంబులు గావించెను. అంత నా కృష్ణ దేశిక ప్రభుస్వాముల వారుద్ధవునిం జూచి, పుణ్యాత్మా, భ్రాంతికి నెఱుకే కారణంబు ఎఱుకే కార్యము ఎఱుకే వినుచున్నది. ఎఱుకే యన్నింటిని గురు తెఱుంగుచున్నది. పరమపదము వినదు. తినదు. గురుతెఱుంగదు. ఎఱుకే వలననే మాయ, మాయ యెఱుకను నాకు గురు దక్షిణముగా నిమ్ము. గురునకు దత్తమైన యెఱుకను మరల గ్రహించుటయే గురు ద్రోహము, ఎన్నండైనను నీ యెఱుకను నీవని భావించిన యెడల భ్రాంతి నిన్ను విడువనేరదు. భ్రాంతి లేని వాడవు గమ్మని పరిపూర్ణ భావ మంతయు బోధించి ఈ పరమపదముకంటె నేమిలేదు. అంతయు బరమ పదము. బరమపదంబునకు బ్రతిలేదు. ఈ గుఱుతెఱుంగు శరీరంబునకు మూలము లేదు. కలలో వచ్చిన శరీరములు మేల్కొన్న నేమిలేదు. ఇదియే భ్రాంతి రహితము. ఈ గఱుతెఱుంగు శరీరములకు మూలమున్నదని చెప్పెడు మూర్ఖులు విస్తారంబు వారు విశ్రాంతి మార్గమైన వేదాంతంబు నెఱుంగరు. భ్రాంతిచేత నున్నవారు వారు గురు వాక్యము నెఱుంగరు. "తస్యమూలంనాస్తి" ఈ శరీరములకు మూలము లేదు. శ్లో॥ అశరీరం సర్వదాస్తి। శరీరం రహితం సదా। ఇదమేవ సద్యోముక్తి। స్సర్వదా భ్రమ

కారణం ॥ అని యున్నది యెఱుకను గురు దక్షిణగా నిచ్చుటే సరి, యని పరిపూర్ణమును నెఱుకను దృఢపఱచి, యుద్ధవా, మన యిర్వుర సంవాద రూపకమైన యీ పరమపద మార్గంబున శరీర గురు సాంప్రదాయకుల వలన నెఱింగిన వారు పరమపదమైన విశ్రాంతి మార్గము నొందుదురు. అశరీర గురు సాంప్రదాయకులవలన నెఱింగినవారు మోక్షాది బదవుల బొందుదురు. శ్రద్ధాసక్తులై చదివిన వారును వినినవారును బుణ్య లోకములకుం బ్రాపింతురు ఇందుకు సందియంబు లేదు. ఇదియే గురు వాక్యము ఇదియే సత్యమార్గము ఇదియే సిద్ధాంతము. ఇదియే వేదాంతము. ఇదియే రాజమార్గము ఇదియే యచలము ఇంతకంటె నేమి లేదు. ఇదియే బరమపురుషార్థంబని శ్రీకృష్ణ దేశిక ప్రభు స్వాములవా రుద్ధవునకు సర్వంబును బోధించి భ్రాంతి రహితునిగా జేసి యిట్లనియె.

ఉద్ధవా! తొల్లి జనకమహారాజునకు మాండవ్య మహర్షికిని జరిగిన సంవాద ప్రకాంబు వినుము.

### జనకమహారాజు మాండవ్యమహాఋషి - సంవాదము

మాండవ్య మహర్షి జనకమహారాజుంగాంచి సంభ్రమంబున, రాజోత్తమా! యా మిథిలాపురంబు కాలునపుడు మీ చిత్తం బేరీతిగా నుండెను? (క్షుత్పిపాసమనెడు) ఆకలిదప్పులను నడగించుటకు నుపాయం బెద్ది? ఎఱింగింపుడని వేడిన నా పుడమిఱేడు చిఱునగవుతో నా ముని పుంగవుం గాంచి, తాపసోత్తమా! ఈ మిథిలాపురికి నలుదిక్కుల యందు నగ్నిదరికొని మండుతఱి నా చిత్తము నా నిజస్వరూపమగు బట్టబయలందే నిలిచెను. మిథిలయను నిశ్చయము బట్టబయలు గనుక నది కల్గుటెట్లు? అది సర్వకాలము చలింపక యొక్కటే విధంబుగా నుండును. అది యుగ్నింగాలదు. వానకుం దడువదు, చలికి నులికి పడదు. రాతికిం బగలదు. కత్తికిం దెగదు. నాకు జింతయే లేదు. మఱియు క్షుత్పిపాసలు చేతనంబులైన జీవకోట్ల కన్నింటికి గల్గియే యుండును. గోవులకు గొమ్ములు తనయందే కలిగి తనతో గూడనే యవి వృద్ధిబొందినట్లు, సర్వ శరీరంబులకు క్షుత్పిపాసలు కారణంబులుగా నుండి శరీరంబులను వృద్ధిబొందించుచున్నవి. కాబట్టి సర్వవాంఛ (లనెడు కోరిక) లకు ధనమే కారణముగా నుండి

విషయాది భోగంబులను జేయించుచు, మా బంధువులు మా యిండ్లు, మా బిడ్డలు, మా భార్యలు, మా ధనము, మా సొత్తు లనియెడు నాశా పాశంబులచే బాధింపం బడుచుందురు. మానవులు సహా జీవకోట్లను నాకలిదప్పులణగించుట యెట్లు? సర్వ సంకల్పంబులకు మూలమైన చిత్తమును నిరోధించుట యెట్లు? సర్వము భ్రాంతి లేకుండిన వారికి క్షుత్పిపాసలు లేవు. కాబట్టి నిజ గురుపుత్రులైన యశరీరుల నిజగురు వాక్యములైన షోడశాక్షరీ ద్వాదశాక్షరీ భావంబులను గ్రహించి, షోడశాక్షరి వలన నేను, నాది, నీవు, నీది, తాను తనది యనెడు వాక్యంబుల జిక్కిన నాలుగు శరీరములను విడిచి, ద్వాదశాక్షరిని మాత్రమే ధరించి యశరీరులై, కర్తకర్మ క్రియలం బరగక సంకల్ప వర్జితులై తమకు లభించినమట్టుకు భుజించుచు ద్రావుచు, గట్టుచు, బరుండచు, నిష్కాములై యుందురు వారికి నే యవస్థలును లేవు సుఖము – దు:ఖము, పుణ్యము – పాపము, స్వర్గంబు – నరకంబు, మోక్షంబు – బంధంబు – సగుణంబు – నిర్గుణంబు, మంచి – సెబ్బర, ధర్మంబు – అధర్మంబు మొదలగు ద్వందంబులను నశింపజేసి, శాంత శమదమాది గుణంబులు గలిగి సర్వసములై యుండునట్టి మహాత్ములే క్షుత్పిపాసల నడగించిన వారు వారికి గృష్ణాజిన దండ కమండలములను, జడలు ధరించుటయును తలలు బోడి చేసికొనుటయును, గాషాయ వస్త్రంబులు ధరియించుటయును, నీ మొదలగు వేషములు పనిలేదు. అచల స్వరూపమును గనిపెట్టుట ధుర్లభంబని చెప్పిన, నా మాండవ్యమహాఋషి, యద్భుతానందబును బొంది, రాజేంద్రా! నీ మధుర వాక్యంబులను జిత్త శుద్ధికిని మిగుల సంతసించితిని, క్షుత్పిపాసల నడిగించెడు యుక్తినిం దెలిసికొంటిని. కోరికలు లేకయే యాహారము సంభవించుటకు సంశయంబు లేదని మనంబున నిశ్చయించితినినని పలికి సెలవు పొంది, తన నిలయంబు నకుం బోయెను. కాబట్టి నీవు గోరికలు లేనివాడవు గమ్ము.

ఉద్ధవా! యీ పరమపద మార్గము దేవతలకును, మహర్షులకును దెలియుటకు మిగుల దుస్తరంబై యుండును. యాజ్ఞావల్కి వలన జనక మహారాజు గ్రహించి పరమబదమును బొందెను. జనకమహారాజు వలన శుకబ్రహ్మము, శుకబ్రహ్మము వలన నా గురుండైన సాందీప మహర్షియును,

సాందీప మహర్షి వలన నేనును గ్రహించితిమి నా వలన రుక్మిణియును, దూర్వాసుండును, నృగుండును, నర్జునుండును, నీవును గ్రహించితిరి. ఇంతకంటె నెక్కువ మార్గంబు లేవు. ఇదియే కల్పనా రహితమైన పరమపద మార్గంబు దీనిని నమ్మక మఱియొకటిని నమ్మిన వారికి సంకెలలు వదలవు ఇది యాద్యంతంబులులేని రాజమార్గంబు. మహిమయును జిత్ర విచిత్రంబు లును లేని యీ మార్గంబనేక జన్మ సంస్కారులైన భక్తియోగ జ్ఞానులకే పట్టునుగాని, తక్కిన వారికిం బట్టక సంశయంబులు పుట్టించుచుండును. సంశయమే జన్మహేతువని సర్వంబును బోధించెను. అంత నా యుద్ధవుం డంజలీ బద్ధుండై యా మహాత్మునిం బెక్కువిధముల వినుతించి యెఱుకను గురుదక్షిణగా సమర్పించి, యెందును సంశయంబులు లేనివాడై యచల భావంబును స్థిరమైన మానసముతో మూలములేని యీ శరీరమేమి లేదనియును, నీ బట్టబయలు కంటె నేమి లేదనియు నెఱింగి తన నిజ స్వరూపమునుం బొంది పరిపూర్ణుండై పరమ పదంబును బొందెను.

ఇది శ్రీమద్వేదాంతసారుండును, బ్రకృతి ద్వయదోష రహితుండును,
నాదబిందుక ళాతీతుండును సచ్చిదానంద రహితుండును,
నుపాధిద్వయదోష రహితుండును, నచల పరిపూర్ణుండును,
నశరీరుండును, జ్ఞానాతీత కేవలాత్ముండు నైన. సద్గురు స్వామికి
శిష్యుండును, పోకల రామగోపాలనాయని వారికి దృతీయ
పుత్రుండునునైన పోకల – శేషాచలాహ్వాయు డాంధ్రంబున
రచించిన
శ్రీ కృష్ణోద్ధవ సంవాద మనెడు
పరమపద మార్గము
సంపూర్ణము